# నేటి హైదరాబాద్




ఔరంగాబాదు
పర్భణి
ఆదిలాబాదు
నాందేడ్
బీర్
నిజామాబాదు
కరీంనగర్
ఉస్మానాబాదు
మెదక్
వరంగల్లు
బీదరు
ఖమ్మంమెట్టు
హైదరాబాదు
గుల్బర్గా
నల్లగొండ
మహబూబునగరము
రాయచూరు

తెలంగాణ
కర్ణాటక
మరాఠ్వాడా



పోచంపల్లిలో డా. సుశీలా నయ్యర్ : మొట్టమొదటగా భూదానంచేసి భూదానోద్యమానికి కారకులైన శ్రీ పోచంపల్లి రామచంద్రారెడ్డిగారు, డా. సుశీలా నయ్యర్ పోచంపల్లికి విచ్చేసిన సందర్భంలో ఆ గ్రామంలో ఏర్పాటుచేయబడిన బహిరంగసభలో ప్రసంగిస్తున్నారు.

[దిగువ] 1956 ఆగస్టు 31 వ తేదీన మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్ తాలూకాలో బూర్గుల రోడ్డును రాష్ట్రముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



## విషయ సూచిక







వెనుక కవరు :
ప్రజా ప్రణాళికకు ప్రచారం
మోటారు ప్రయాణానికి వీలుకాని
మారుమూల గ్రామాలలో పంచవర్ష
ప్రణాళిక ప్రచారానికి ఉపయోగిస్తున్న
ఎద్దుబండ్లలో ఒకటి.

ముఖచిత్రం :
*1*వ నవంబరు *1956* నాడు
ప్రక్క రాష్ట్రాలలో కలువనున్న
హైదరాబాదు రాష్ట్రపు
మూడు భాషా ప్రదేశాలు.


**హైదరాబాదు పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి, అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.**

# TOWARDS
# A
# WELFARE STATE



*Progress of the*

## FIRST
## FIVE-YEAR PLAN
*IN*
## HYDERABAD



PRICE: Rs. 2-0-0

*Obtainable from :*

**THE DEPARTMENT OF INFORMATION & PUBLIC RELATIONS,**
**HYDERABAD. I (Dn)**

# రాష్ట్ర విచ్ఛిత్తి: నవరాష్ట్ర అవతరణ

**నవంబరు 1, 1956 తేదీనుంచి హైద్రాబాదు రాష్ట్రమంటూ ఒక రాష్ట్రం ఉండదు. దక్కను పీఠభూమిలో 82, 168 చదరపుమైళ్ళ వైశాల్యం, దాదాపు రెండుకోట్ల జనాభాతో ఒక ప్రత్యేక పరిపాలనా యూనిటుగా ఉంటూవచ్చిన ఈ రాష్ట్రం అదృశ్యమవుతున్నది. ఇక కేవలం హైద్రాబాదు అనే పేరుతో రాజధానీనగరం మాత్రమే ఉంటుంది. హైద్రాబాదు రాష్ట్ర నిర్మాణం క్రమేపీ జరిగింది. కాని ఈ ప్రాంతంలో అనేక చారిత్రక సంఘటనలు జరిగినవి. అనేక ప్రాబల్యాలు, ప్రభావాలు ఈ రాష్ట్రాన్ని వివిధదశలుగా ఈ స్థితికి తెచ్చినవి. ఇప్పు డిది భారతదేశ చరిత్రలో పరిణామాత్మక మైన ఒక కొత్తదశలోకి ప్రవేశిస్తున్నది. ఈ పరిణామం సహజ మైనది, అనివార్య మైనది.**

పూర్వం దక్షిణాపథం అని వ్యవహరింపబడిన ప్రాంతం ఇప్పటి హైద్రాబాదురాష్ట్రమే అని కొందరి విశ్వాసం. అశోక చక్రవర్తి అధికారం మొత్తం బెరారు ప్రాంతం పైన, హైద్రాబాదు రాష్ట్రంలోని తూర్పు, ఈశాన్య దిశలలో గల కొన్ని ప్రాంతముల పైన వుండేది. ఔరంగాబాదు జిల్లాలోని పైఠాన్‌లో పిఠెనికులు నివసించెడివారు. పిఠెనికులను అశోక చక్రవర్తి జయించాడు.

దక్షిణ భారతంలో గల ఈ ప్రాంతంలో చాలా భాగాన్ని క్రీస్తుకు పూర్వం దాదాపు రెండు శతాబ్దాల నుంచి ఆంధ్ర రాజులుపరిపాలించారు. ఒకప్పుడు వారి సామ్రాజ్యం కృష్ణాడెల్టా మొదలు నాసిక్ వరకు విస్తరించివుండేది. తరువాత ఈ ప్రాంతమును పల్లవులు, వారి తరువాత చాళుక్యులు, వారి తరువాత యాదవులు పాలించినారు. యాదవులు తమ రాజ్యాన్ని దేవగిరిలో నెలకొల్పినారు. అది తరువాత దౌలతాబాదుగా వ్యవహరింపబడినది. ఈలోపున కాకతీయులు ౧౨వ శతాబ్దం మధ్య భాగంలో వరంగలులో తమ రాజ్యం స్థాపించారు. ఢిల్లీ సుల్తానులు ఈ రెండు రాజ్యాలపై దండయాత్రలు చేస్తూఉండేవారు. కాకతీయులను ౧౩౨౧ లో ఉలఘ్‌ఖాన్ జయించాడు. ఈతడే ఆ తరువాత మహమ్మద్‌బిన్ తుగ్లక్ అను పేరుతో వ్యవహరింపబడినాడు. దేవగిరి పాలకుడైన హరపాలుని పట్టుబడచేసి, అతడిని చంపివేయడంతో యాదవ వంశం కూడా ౧౩౧౮ లో అంతరించింది. తుగ్లకు దేవగిరికి దౌలతాబాదు అని పేరుపెట్టి తన రాజధానిని అచటికి మార్చినాడు.

## బహమనీ రాజులు

ఆ తరువాత కొద్ది కాలంలోనే దక్కన్‌లోని సూబేదారులు ఢిల్లీ సుల్తానులపై తిరుగుబాటు చేశారు. జఫర్‌ఖాన్ అనునాతడు అలావుద్దీన్ హసన్‌షా గంగూ బహమనీ అను పేరుతో ౧౩౪౭ లో గుల్బర్గా రాజధానిగా బహమనీ వంశ రాజ్యమును స్థాపించాడు. బహమనీరాజులు విజయనగరం, వరంగల్లు, పానగల్లు రాజులతో తరచు యుద్ధానికి తలపడుతూ ఉండేవారు. ఆ యుద్ధములలో జయాపజయములు ఎటూ తేలకుండా ఉండేవి. ౧౪౩౦ లో బహమనీవంశ రాజు అహమ్మద్‌షా సుందరమైన పీఠభూమిపై బీదరుపట్టణాన్ని కట్టించాడు. బహమనీ వంశ రాజులు కొందరు అతి క్రూరంగా పరిపాలించారు. వారి హయాంలో పెద్దపెట్టున జనసంహారం జరిగింది. వారిలో కొందరు సుఖ భోగములకు, దుర్వ్యయములకు అలవాటు పడ్డారు. ఫలితంగా ౧౪౮౨ లో సింహాసన మధిష్ఠించిన మహమూద్‌షా అనునాతడు దక్కన్ రాజ ప్రతినిధులపై తన అధి

పత్యమును గోల్పోయి, యూసుఫ్ ఆదిల్‌ఖాన్ అను నాతనిచే ఓడింపబడ్డాడు. యూసుఫ్ ఆదిల్‌ఖాను బీజాపూరును పట్టుకొని తాను స్వతంత్రుడనని ప్రకటించాడు. రాజుయొక్క బలహీనతవల్ల అతడిమంత్రియే సర్వాధికారి అయినాడు. మహమూద్‌షా ౧౫౭౮ లో మరణించాడు. ఆయన తరువాత నలుగురు రాజులు పరిపాలించారు. చివరివాడు కలీముల్లాషా ౧౫౨౭ లో అహమ్మద్‌నగర్‌లో ప్రవాసంలో ఉండగా మరణించాడు. అప్పుడు మంత్రిగా వున్న అమీర్‌బరీద్ అను నాతడు రాజ్యాన్ని పరిపాలించ మొదలుపెట్టాడు. అతడి కుమారుడు అలీబరీద్ 'షా' బిరుదు వహించి బరీద్‌షాహీ వంశ స్థాపనకు కారకుడైనాడు. ఇతడు ఇతర మహమ్మదీయ రాజులతో కలిసి ౧౫౬౫ లో విజయనగర రాజ్యంపై జరిగిన తళ్ళికోట యుద్ధంలో పోరాడినాడు. ఇతడు ౧౫౮౨ లో మరణించగా తరువాత మరి ముగ్గురు రాజులు పరిపాలించారు.

## కుతుబ్‌షాహీ రాజులు

ఈ లోగా బహమనీవంశ రాజుల హయాంలో గోలకొండ సూబేదారుగా వున్నట్టి ఖుతుబుల్ముల్కు స్వతంత్రుడై ౧౫౧౨ లో ఖుతుబ్‌షాహీవంశ రాజ్యమును స్థాపించాడు. ఈయనపూర్వీకులు టర్కీజాతికి చెందినవారు. ఈ వంశపు రాజులలో కడపటివాడు తానాషా. ఈయన పరిపాలనా కాలంలో శ్రీరామ భక్తుడైన రామదాసు భద్రాచలఆలయాన్ని కట్టించడం జరిగింది. ఔరంగజేబుచక్రవర్తి ౧౬౫౫ లో హైద్రాబాదును కొల్లగొట్టి ౧౬౮౭ లో గోలకొండను స్వాధీన పరచుకొని తానాషాను దౌలతాబాదులోనిర్బంధించాడు. తానాషా ఆ నిర్బంధంలోనే ౧౭౦౪ లో మరణించాడు.

## ఆసఫ్‌జాహీ వంశం

ఔరంగజేబు సేనాపతులలో ఆసఫ్‌జాహి ఒకడు. ఈతడు ౧౭౧౩ లో నిజాముల్ముల్కు బిరుదుతో దక్కనులో సూబేదారుగా నియమింపబడినాడు. ఇతడు స్వతంత్రుడై ౧౭౨౪ లో బుల్దానా జిల్లాలోని షకర్‌ఖేల్డావద్ద ఖాందేశ్ సూబేదారగు ముబారిజ్‌ఖాన్ నోడించి తన స్వాతంత్ర్యాన్ని బలపరుచుకున్నాడు. కాని ఇతడు స్వతంత్రుడు కావడం ఢిల్లీ దర్బారు వారికి ఇష్టం లేకపోయింది. అందుచేత వారు ఆసఫ్‌జాపై దండెత్తవలసిందని ముబారిజ్‌ను పురికొల్పినారు. ఆసఫ్‌జా బెరారును కూడా స్వాధీన పరచుకొని, హైద్రాబాదులో స్థిరపడినాడు. ఇతడు ౧౭౪౮ లో మరణించాడు. మరణకాలం నాటికి ఈయన రాజ్యంలో మొత్తం హైద్రాబాదు రాష్ట్రం, బెరారు కూడా ఉండేవి.

ఆసఫ్‌జా మరణించిన తరువాత రాజ్యాధిపతి ఎవరు కావడం అన్న విషయమై అతడి రెండవ కుమారుడగు నాసిర్‌జంగుకు, మనుమడగు ముజప్ఫర్ జంగుకు వివాదంవచ్చింది. ముజప్ఫర్‌జంగు ఆసఫ్‌జా కూతురుయొక్కకుమారుడు. నాసిర్‌జంగును ఇంగ్లీషు వారు బలపరిచారు. ముజప్ఫర్‌జంగును ఫ్రెంచివారు బలపరిచి, అతడే రాజని ప్రకటించారు. అతడిని కొందరు పఠాన్ సర్దార్లు చంపివేయగా ఫ్రెంచివారు నాసిర్‌జంగ్‌తమ్ముడగు సలాబత్‌జంగును సింహాసన మధిష్ఠింప జేశారు. అయితే కర్ణాటకంలో క్లైవు సాధించిన విజయాల కారణంగా ఫ్రెంచివారు రంగం విడిచిపోవలసి వచ్చింది. పర్యవసానంగా ఇంగ్లీషు వారు సలాబత్‌జాను దింపివేసి అతడి స్థానంలో ఆసఫ్‌జా నాల్గవ కుమారుడైన నిజాంఅలీఖానును ౧౭౬౧ లో సింహాసనంపై కూర్చుండబెట్టారు.

## బ్రిటిషువారి అధికారం

ఆ తరువాత అనేక సంధులు జరిగినవి. ఆ సంధులవల్ల బ్రిటిషు వారికీ, నిజాముకు మధ్య సంబంధాలు బలపడినవి. నిజాము కూడా తన అధికారాన్ని కట్టుదిట్టం చేసుకున్నాడు. ౧౭౬౬ లో ఉత్తర సర్కార్లు బ్రిటీషు వారికి దత్తం చేయబడినవి. ౧౮౦౦ లో దత్త మండలములు కూడా బ్రిటీషు వారు సైనిక సహాయం చేసినందుకుగాను వారికి అప్పగించ బడినవి. ౧౮౦౩ లో సింధియా, హోల్కార్లు నిజాం రాజ్యంపై దండెత్తారు. కాని

ఇంగ్లీషువారు వారిని అస్సాయే, ఆవగాంలవద్ద ఓడించారు.

౧౮౦౩లో నిజాంఅలీఖాన్ మరణించగా, ఆయన కుమారుడు సికిందర్‌జా రాజ్యమునకు వచ్చాడు. అతడి తరువాత ఆయన కుమారుడు నాసిరుద్దౌలా ౧౮౨౯ లో రాజ్యాధిపతి అయినాడు. ౧౮౫౩ లో మరొక కొత్త సంధి జరిగింది. ఆ సంధి ప్రకారం బెరారు, ఉస్మానాబాదు, రాయచూరు దువాబ్ జిల్లాలు బ్రిటీషువారికి దత్తం చేయబడినవి. ఈ సంధి జరిగిన వారంరోజుల తరువాత నవాబ్ సాలార్జంగ్ మంత్రి అయినాడు.

## విశ్వాసపాత్రమైన మిత్రుడు

నాసిరుద్దౌలా అనంతరం ౧౮౫౭ లో ఆయన కుమారుడు అఫ్జలుద్దౌలా రాజ్యమునకు వచ్చినాడు. ఇతడు సాలార్జంగ్ సలహా ననుసరించి సిపాయీల పితూరీ అని వ్యవహరించబడిన ప్రప్రథమ భారత స్వాతంత్ర్యపోరాటంలో బ్రిటీషువారికి విశ్వాసపాత్రుడుగా వున్నాడు. అందుకు ప్రతిఫలంగా బ్రిటీషువారు ౧౮౬౦ లో మరొక కొత్త సంధి జరుపుకొని ఉస్మానాబాదు, రాయచూరు దువాబ్‌లను ఇతడికి తిరిగి ఇచ్చివేశారు. అంతేగాక ఇతడు ఇవ్వవలసిన ౫౦ లక్షల ఋణమును కొట్టివేసి, ౧౦,౦౦౦ పౌనుల విలువగల బహుమానములను, జి. సి. యస్. ఐ. అను బిరుదును కూడా ఇతడికి ప్రసాదించినారు. ఇతడి మంత్రికి, ఇతర పెద్దలకు తగు బహుమతులిచ్చారు.

అఫ్జలుద్దౌలా తరువాత ౧౮౬౯ లో మూడేండ్ల వయస్సుగల ఆయన కుమారుడు మీర్ మహబూబ్ అలీఖాన్ రాజ్యాధిపతి అయినాడు. రాజు బాలుడగుట చేత రాజ్య వ్యవహారములను నిర్వహించడానికై మొదటి సర్ సాలార్జంగ్ రీజెంటుగా, నవాబ్ షమ్సులుమ్రా కో-రీజెంటుగా నియమింపబడినారు. షమ్సులుమ్రా ౧౮౭౭ లో మరణించగా అతడి సవతితల్లి కుమారుడు నవాబ్ వికారుల్ ఉమ్రా కో-రీజెంట్ అయినాడు. ఇతడు కూడా ౧౮౮౧ లో మరణించగా సర్‌సాలార్‌జంగ్ ఏకైకపాలకుడుగా, రీజెంటుగా రాజ్య పరిపాలన నిర్వహించాడు. పరిపాలనలో ఇతడు అనేక సంస్కరణలు ప్రవేశపెట్టాడు. రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని బాగుపరిచాడు. ప్రభుత్వ సర్వీసు లన్నిటినీ దృఢమైన పునాదులపై వ్యవస్థీకరించాడు. ఇతడు ౧౮౮౩ లో మరణించాడు. ఆ మరుసటి సంవత్సరం మీర్ మహబూబ్ అలీఖాన్ యుక్త వయస్సుకు రాగా లార్డు రిప్పన్ ఆయనను రాజ్యాధిపతిని చేశాడు. ఆయనకు రెండవ సర్ సాలార్‌జంగు మంత్రి అయినాడు. రెండవ సాలార్జంగు తరువాత ౧౮౮౭ లో సర్ ఆస్మాన్‌జా మంత్రి అయినాడు. మంత్రియొక్క ఉపయోగార్థమై ౧౮౯౩ లో 'ఖానూన్చె ముబారక్' అనే శాసనం జారీ చేయబడింది. ఆ తరువాత మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది. రెండవ సంవత్సరం సర్ వికారుల్‌ఉమ్రా మంత్రి అయినాడు. ఆయన తరువాత ౧౯౦౧ లో మహారాజా సర్ కిషన్‌ప్రసాద్ బహద్దుర్ మంత్రి అయినాడు. ౧౯౦౨ లో బెరార్ జిల్లా ఏటా రూ. ౨౫ లక్షల కౌలుపై శాశ్వతంగా బ్రిటీషు ప్రభుత్వానికిచ్చివేయబడినది.

## బ్రిటీషువారి జోక్యం

౧౯౧౧ లో ఏడవ నిజాముగు నవాబ్ సర్ మీర్ ఉస్మానలీఖాను రాజ్యాధిపతి అయినాడు. బ్రిటీషువారు తమ్ముతాము సర్వాధిపతులమని చెప్పుకొని, సంస్థానంలో పరిపాలన సక్రమంగా జరుగడం లేదన్న కారణంతో సంస్థాన పరిపాలనలో జోక్యం కల్పించుకొని, ప్రభుత్వం యొక్క రెవిన్యూ, పోలీసు, పరిశ్రమల శాఖలకు బ్రిటీషు అధికారులను నియమించారు. ఈ అధికారులలో ఒకరు మంత్రిమండలి సమావేశాలలో పాల్గొనేవారు. మంత్రిమండలివారు ఏకగ్రీవంగా ఇచ్చిన సలహాను నిజాం తిరస్కరించలేక పోయినాడు. అంతే; బ్రిటీషు రెసిడెంటు ఆమోదం లేనిదే మంత్రులను కూడా నియమించజాలక పోయినాడు.

[తరువాయి ౧౬ వ పుటలో]

# ప్రణాళిక ప్రచారం



దేశానికి పంచవర్ష ప్రణాళిక ఎంత ముఖ్యమైనదో 1956 సెప్టెంబరు 3 వ తేదీన ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో ప్రణాళికవారం ప్రారంభోత్సవాన్నిబట్టి విదితమవుతున్నది. ఆ ప్రారంభోత్సవం చాలా అసాధారణమైన వాతావరణంలో జరిగింది. అంతకు క్రితంరోజే హైదరాబాదు - మహబూబునగరు రైలుమార్గంపై జరిగిన ప్రమాదంవల్ల నగరం యావత్తు శోకంలో మునిగివుంది. ప్రారంభోత్సవానికి విచ్చేసినవారంతా ఆ ప్రమాదాన్ని గూర్చే ఆలోచిస్తున్నారు. ప్రమాదం జరిగిన స్థలాన్ని చూచి అప్పుడే నగరానికి విచ్చేసిన ముఖ్యమంత్రికూడా చింతాక్రాంతులుగా కన్పించారు. ఇతర విషయాలను గూర్చి ఆలోచించడానికి ఆయన మనస్సు అప్పుడు సరిగాలేదు. అయినా ప్రణాళిక ప్రారంభోత్సవాన్ని తాము వాయిదా వేయజాలమని ఆయన ప్రసంగంలో చెప్పారు.

*ఈ ప్రపంచంలో సుఖదుఃఖాలు రెండూ ఉన్నవి. ఈ రెండింటిలో ఏది సంభవించినా దాన్ని మనం ఎదుర్కోవాలని భగవద్గీత మనకు బోధిస్తున్నది. ఎంత దుఃఖం కలిగినా కర్మ ఒక్క క్షణమయినా ఆగడానికి వీలులేదు. కనుకనే మనం ఆ గీతావాక్యాన్ని అనుసరిస్తూ పంచ వర్ష ప్రణాళిక ప్రచార వారాన్ని వాయిదా వేయకుండా జరుపుకుంటున్నాము" అంటూ ముఖ్య మంత్రి ప్రారంభోత్సవం చేశారు.*

ప్రారంభోత్సవం జరిగిననాడు వర్షం, అదీ లేక వాతావరణం బాగావుంది. వేదిక ఒక సంచార రంగ స్థలంపై అమర్చబడింది. ఆ సంచార రంగస్థలం గ్రామాలలో తిరుగుతూ ప్రణాళికను వివిధ ప్రదర్శనములద్వారా ప్రచారం చేసే ఉద్దేశంతో నిర్మించ బడింది.

## ప్రజా సహకారం

ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించవలసిందిగా దేశీయాంగశాఖ కార్యదర్శి రాష్ట్రమంత్రి శ్రీ బి. యస్. మెల్కోటేను కోరుతూ ఇతర రాష్ట్రాలలోకంటె హైదరాబాదు రాష్ట్రంలో పంచవర్ష ప్రణాళిక కొంచెం ఆలస్యంగా ప్రారంభమైనప్పటికీ పెట్టుకున్న లక్ష్యాలను సాధించామనీ, కొన్ని విషయాలను, లక్ష్యాలను మించి ఫలితాలు సాధించామనీ అన్నారు. ఈ ఫలితాలను సాధించడంలో ప్రజల సహకారం ముఖ్యంగా గ్రామీణ ప్రజల సహకారం అతిముఖ్యమయినది. మొదటి ప్రణాళికలో ప్రచారానికి ఏర్పాట్లు చేయబడలేదు. అయినా ప్రణాళిక ముఖ్యాంశాలను పత్రికలు, రేడియో, సినీమాలు మొదలగు సాధనాలద్వారా ప్రజలకు వివరించ బడినవి.

ఇప్పుడు రెండవ ప్రణాళిక సిద్ధం చేయబడినది. ఇది చాలా భారీ ప్రణాళిక. మొదటి ప్రణాళికకంటె ఇది విశేషంగా ప్రజాప్రణాళిక అనిపించుకొంటుంది. కారణ మేమంటే ఇది పైనుంచి క్రిందివరకుగాక, క్రిందినుంచి పైకి, ప్రజావసరాలను దృష్టిలో వుంచుకొని రచింపబడింది. కనుక దీనిని అమలు జరుపాలంటే ప్రజలు చాలా సన్నిహితంగా సహకరించవలసిన అవసరం వున్నది. కాబట్టే ప్రజలలో చదుపుకున్న వారికీ, చదువు రానివారికీ ప్రణాళిక వివరాలను ప్రచార సాధనాలద్వారా తెలియ జేయడానికై రెండవ ప్రణాళికలో ప్రచారం నిమిత్తం తగు ఏర్పాట్లు చేయబడ్డవి. ఈ సాధనాలలో ప్రదర్శనాలు

మైసూరు ముఖ్యమంత్రి శ్రీ కడిదల్ మంజప్ప మైసూరురాష్ట్ర విద్యామంత్రి శ్రీ రామచంద్రరావుతో కలిసి హైదరాబాదులో ఏర్పాటుచేయబడిన పంచవర్ష ప్రణాళిక ప్రదర్శనమును చూస్తున్నారు.

[దిగువ] పంచవర్షప్రణాళిక ప్రదర్శనంలో కుటీర పరిశ్రమల కేంద్రాలను చూపే పటమును శ్రీ మంజప్ప ఉత్సాహంతో చూస్తున్నారు.





ప్రదర్శనహాలులో విజిటర్సు బుక్కువద్ద మైసూరు మంత్రులు.

[దిగువ] హైదరాబాదులో పంచవర్ష ప్రణాళిక ప్రదర్శనమును ప్రారంభించేముందు డా. బి. రామకృష్ణారావుగారు ప్రసంగిస్తున్నారు. సభావేదిక సంచార రంగస్థలంపైన ఏర్పాటుచేయబడింది. సంచార రంగస్థలం గ్రామ ప్రాంతాలలో ప్రణాళికా ప్రచారానికి ఉపయోగింపబడుతుంది.





అధ్యక్షోపన్యాసమిస్తున్న రాష్ట్రమంత్రి డా. జి. యస్. మేల్కోటే

ముఖ్యమయినవి. వీటిద్వారా చదువు వచ్చినవారికీ, రానివారికీ ప్రణాళికనుగూర్చి తెలియ పరచవచ్చు. మన రాష్ట్రంలో ప్రణాళికవారం సందర్భంలో రాజధానీ నగరంలో ఈ ప్రదర్శనాన్ని ఏర్పాటుచేయటమే గాక ప్రణాళికయొక్క సందేశాన్ని ప్రజలకు తెలియజేసే కరపత్రాలు, పుస్తకాలు, ఛాయాచిత్రాలు ఇంకా ఇతర విధముల సాహిత్యం జిల్లాలకు పంపబడింది. ప్రణాళిక వారంలో సినిమా ప్రదర్శనాలు, బుర్రకథలు నాటక ప్రదర్శనాలుకూడా ఏర్పాటు చేయబడినవి.

అయితే దురదృష్టవశాత్తు ప్రణాళిక వారం గొప్ప దుర్ఘటన జరిగిన శోకపూరిత వాతావరణంలో జరుపవలసివచ్చింది. రైలు ప్రమాదంలో చాలామంది చనిపోయిన కారణంచేత నగరం, రాష్ట్రం యావత్తు దుఃఖంలో మునిగిపోయింది. ఈ కారణంచేత ఉత్సవాలలో మొదట నిర్ణయం చేయబడిన కార్యక్రమాలను కొన్నింటిని రద్దుపరచవలసివచ్చింది. కేవలం ప్రారంభోత్సవం మాత్రమే బహు సాధారణంగా జరుపబడింది.

## బహుముఖాభివృద్ధి

డాక్టర్ మెల్కోటే తమ అధ్యక్షోపన్యాసంలో మొదటి ప్రణాళిక రచనలో ప్రజా ప్రతినిధులకు భాగం లేకపోయింది గనుక అది అనేకులకు సంతృప్తి కలిగించజాలక పోయిందని అన్నారు. అయినప్పటికీ అనేక రంగాలలో మనం సాధించిన ఫలితాలు గర్వకారణంగా ఉన్నవి. ఆహారోత్పత్తి విషయంలో

లక్ష్యాలను అధిగమించాము. అనేక పరిశ్రమలలో ఉత్పత్తి బాగా హెచ్చింది. పెద్ద ప్రాజెక్టులు, మధ్యరకపు ప్రాజెక్టులలో నిర్మాణం పని చురుకుగా జరిగింది. స్వల్ప నీటివనరులనుకూడా చాలా అభివృద్ధి పరిచాము. ప్రతి సంవత్సరం జరుగుతున్న చెరువుల మరమ్మతు పనుల వివరాలను ప్రస్తావిస్తూ చెరువులు మాటిమాటికీ తెగిపోతూఉండడంచేత వాటి మరమ్మతు విషయంలో పబ్లికువర్క్సు శాఖ అత్యధికమైన శ్రద్ధ వహించవలసి వచ్చింది. ప్రథమ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలోని పాఠశాలల సంఖ్య చాలా పెరిగింది. మన రాష్ట్రంలో ౨౨ వేల గ్రామాలున్నాయని రికార్డులలో ఉన్నదిగాని ఇప్పుడసలు ఉన్న గ్రామాలు దాదాపు ౧౬ వేలు మాత్రమే. గ్రామాలలో ౧౩ వేలకు పైగా పాఠశాలలు పెట్టబడినవి. తమ గ్రామాలలో ఇట్లా పాఠశాలలు ఏర్పడిపోతూవుండడం చూచి ప్రజలే ఎంతో ఆశ్చర్యపడ్డారు. పాఠశాలలేగాక గ్రామాలలో ఆసుపత్రులు, ఔషధాలయాలు, ఇతర వైద్యాలయాలు చాలా హెచ్చినవి.

రెండవ ప్రణాళిక ఉద్దేశపూర్వకంగానే ప్రజల అవసరాలను ప్రాతిపదికగా తీసుకొని రచించడం జరిగింది. ప్రజల అవసరాలేమిటో తెలుసుకోవడానికై గ్రామాలలోనే తగు ఏర్పాట్లు చేయబడినవి. ప్రతిపాదనలను పంపించవలసిందిగా పంచాయితీలు, జిల్లాబోర్డులు మొదలగు స్థానికసంస్థలను కోరడమైనది. వారి కోరికలననుసరించే ప్రాథమిక ప్రణాళిక తయారుచేయబడింది. తరువాతి దానిని ఆచరణ సాధ్యమైన పరిమితికి తేవడానికై ఉన్నతస్థాయిలో తగు విధంగా పరిశీలన జరుపబడింది. చివరకు రెండవ ప్రణాళికలో నిర్ణయించబడిన కేటాయింపులు మొదటి ప్రణాళిక కేటాయింపులకు రెట్టింపుకంటె



డా. రామకృష్ణారావుగారు ప్రదర్శనాన్ని వీక్షిస్తున్నారు.



*ప్రణాళిక ప్రచారం కొరకై మారుమూలలనున్న గ్రామాలకు గొనిపోవబడు ఎద్దులబండి చక్రంపై హైదరాబాదు ముఖ్యమంత్రి కొబ్బరకాయ కొట్టి ప్రారంభోత్సవం సల్పుతున్నారు.*

మించే ఉన్నవి. ప్రజలలో కన్పించిన ఉత్సాహాన్ని బట్టి చూస్తే రెండవ ప్రణాళికను విజయవంతంగా అమలు జరుపడంలో వారు మరింతగా సహకరించి తోడుపడగలరని ఆశించవచ్చు.

## ప్రచారమునకు డబ్బు

ముఖ్యమంత్రి డా. రామకృష్ణారావుగారు ప్రారంభోపన్యాసమిస్తూ తమ మనస్సంతా రైలు ప్రమాదం పైననే ఉన్నదనీ, ప్రణాళికను గూర్చి తామిప్పుడు అట్టే వివరాలను ప్రస్తావించజాలమనీ అన్నారు. "ప్రణాళికను ప్రజలు, ముఖ్యంగా చదువురానివారు, కూడా తెలుసుకోవాలంటే ప్రచారం అవసరం. ప్రచారం లేకపోవడం ఇంతవరకు రాష్ట్రంలో ఒక లోపంగానే ఉంటూవచ్చింది. మేమేదో అద్భుతమైన విషయాలను సాధించామనీ, వాటిని నెత్తిన నోరుపెట్టుకొని, కేకలువేసి ప్రచారం చేయాలనీ నేను అనడం లేదు. కాని సాధించిన ఫలితాలనైనా ప్రజలకు సరిగా తెలుపడం జరుగలేదు. అందుకు కారణం డబ్బు లేకపోవడమే. మొదటి ప్రణాళికలో పెట్టుకున్న లక్ష్యాలను కొన్నిటిని సాధించాము. మరికొన్ని లక్ష్యాలను అధిగమించాము. అయితే అన్నిటినిమించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిన విషయమేమంటే ప్రజలలో ఒకవిధమైన ఉత్సాహాన్ని మనం కలుగజేశాము. ప్రణాళికను అమలు జరుపడంలో ప్రభుత్వంతో

ప్రదర్శనంలో పెట్టబడిన హైద్రాబాదు చేతిపరిశ్రమల వస్తువులను ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు శ్రద్ధగా పరిశీలిస్తున్నారు.

[దిగువ] ప్రదర్శనహాలుకు వెలుపల పెట్టబడిన ప్రచార పత్రాలను శ్రీ గోపాలరెడ్డిగారు వీక్షిస్తున్నారు.



ఔరంగాబాదులో పంచవర్ష ప్రణాళిక వారోత్సవముల కమిటీ వ్యవహర్త శ్రీ ఆర్. ఆర్. మాండ్రుంకర్ పురమందిరంలో ఏర్పాటు చేయబడిన ప్రదర్శనం సందర్భంలో ప్రసంగిస్తున్నారు.

సహకరించా లనే భావన వారిలో కలిగింది. ప్రధాన మంత్రి అన్నట్లుగా మొదటి ప్రణాళికలో ప్రజా సహకారంతో పథకాలను అమలుపరచడం జరిగింది. కాని రెండవ ప్రణాళిక ప్రజల ప్రణాళిక. తమ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని ప్రజలే దాన్ని అమలు జరుపాలి. ప్రభుత్వం అందుకు తగిన సహకారం యిస్తుంది. ప్రజలు ఆ విధంగా చొరవతీసుకొని పని చేయాలంటే ప్రణాళికకు తగినంతగా ప్రచారం ఇవ్వాలి. ప్రచారానికి రూ. ౮౪,౦౦౦ లు మాత్రమే కేటాయింపబడినవంటే ఎంత తక్కువ మొత్తమో ఆలోచించండి. కనుకనే ఇంతవరకు ప్రచారం రీత్యా ఎక్కువ పని జరుగలేదు. ఇప్పుడు రెండవ ప్రణాళికలో ప్రచారానికి రూ. ౨౦ లక్షలు కేటాయించబడ్డవి. వివిధ ప్రచారసాధనాల ద్వారా ప్రణాళికకు తగు ప్రచారం ఇవ్వడానికి ఇప్పుడు ప్రయత్నం ఆరంభమవుతున్నది. డబ్బు ఎంతో పొదుపుగా వాడి ప్రణాళిక వారం జరుపబడుతున్నది'' అని ముఖ్యమంత్రి అన్నారు.

ప్రజల కోర్కెలను, వారి అవసరాలను దృష్టిలో పెట్టుకొని రెండవ ప్రణాళిక తయారుచేయబడింది. ముసాయిదా ప్రణాళికలో రూ. ౩౦౦ కోట్ల ఖర్చు చూపబడింది. అయితే చివరకు రూ. ౧౦౦ కోట్ల వ్యయంమేరకు మాత్రమే అది అంతిమంగా రూపొందించబడింది. ప్లానింగు కమీషన్‌వారు ప్రతి సంవత్సరము పరిస్థితిని సాకల్యంగా పరిశీలించి, స్థితిగతుల దృష్ట్యా, అనుభవం దృష్ట్యా ప్రణాళికలో తగు

ప్రజాశిక వారోత్సవాల సందర్భంలో ఔరంగాబాదులో తీయబడిన ఊరేగింపు. జిల్లా కలెక్టరు, మునిసిపల్ అధ్యక్షులు ఊరేగింపు ముందునడుస్తున్నారు.

[దిగువ] ఊరేగింపులో వ్యవసాయశాఖ ప్రచార శకటం.



మార్పులు చేసుకుంటూ పోవడానికి నిర్ణయించారు. ఐతే ప్రాథమికమైన మార్పులుమాత్రం చేయబడవు.

రైలు ప్రమాదంలో అసువులు బాసిన వారికి సంతాపం తెలుపుతూ సభవారు ఒక నిమిషంసేపు మౌనంగా నిల్చొన్నారు. ఆ తరువాత ముఖ్యమంత్రి ఎగ్జిబిషన్ హాలువైపుకు నడచి రిబ్బను కత్తిరించి, ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు.

ప్రణాళిక ప్రదర్శనం రాష్ట్ర ప్రభుత్వ వివిధశాఖల సహకారంతోను, కేంద్ర ప్రభుత్వ సమాచార ప్రసార మంత్రిత్వశాఖ యొక్క ఎగ్జిబిషన్ డివిజన్ వారి సహకారంతోను ఏర్పాటుచేయబడింది. రాష్ట్రంలోను. భారతదేశంలోని ఇతర ప్రాంతాలన్నిటిలోను నిర్మింప బడుతున్న అనేక ప్రాజెక్టులకు సంబంధించిన ఛాయా చిత్రాలు, పటములు, నమూనాలు ప్రదర్శనంలో పెట్ట బడినవి. కుటీర పరిశ్రమలలో తయారు చేయబడిన వస్తువులు కూడా ప్రదర్శింపబడినవి. ప్రతిరోజు సినిమా ప్రదర్శనాలు హిందీ తెలుగు భాషల వ్యాఖ్యా నాలతో సహా చూపబడినవి. ప్రతిరోజు సాయంత్రం సంచార రంగస్థలంపై నాటకాలు, బుర్రకథలు మొద లగు వైజ్ఞానిక కార్యక్రమాలు ఉండేవి. ఈ వారం రోజులు అనేకమంది నగరవాసులు, గ్రామస్థులు వచ్చి ప్రదర్శనాన్ని చూచారు. ఆంధ్ర ముఖ్యమంత్రి, మైసూరు ముఖ్యమంత్రి, మైసూరు విద్యామంత్రి కూడా ప్రదర్శనానికి వచ్చారు.

ప్రారంభోత్సవం రోజే డా. బి. రామకృష్ణారావు గారు ఎద్దులబండి ప్రచారక యూనిటును కూడా ప్రారంభించారు. ఈ బండి మోటారుల ద్వారా పోజాలనట్టి గ్రామీణ ప్రాంతాలలో ప్రచారంకొరకు ఉపయోగించబడుతుంది. దీనిలో సినిమా ప్రొజెక్టరు కూడా అమర్చబడి ఉంటుంది.

హైద్రాబాదు, సికింద్రాబాదు నగరములలోని అనేక విద్యాసంస్థలు ఊరేగింపులు, సభలు, ప్రదర్శనములు ఏర్పాటుజేసి ప్రణాళిక వారోత్సవాన్ని జరిపినవి.

## జిల్లాలలో....

జాల్నాలోని ఉన్నతపాఠశాలలో రాష్ట్ర ప్రభుత్వ ప్లానింగు శాఖ ఉపమంత్రి శ్రీ వి. జి. గాడే ప్రణాళిక వారానికి ప్రారంభోత్సవం చేశారు. సాధారణంగా నిర్మాణ కార్యక్రమ రంగంలో, సామాజికాభివృద్ధి ప్రాంతాలలో జరిగిన కృషిని ఆయన ఉదహరిస్తూ రెండవ ప్రణాళికను విజయవంతం చేయడంలో ప్రజలు సహకరించాలని విజ్ఞప్తిచేశారు.

షాద్‌నగర్‌లో ప్రణాళిక వారోత్సవాల సంద ర్భంలో స్థానిక గ్రంథాలయంలో సామాజికాభివృద్ధి బ్లాకు అధికారులచే ఏర్పాటుచేయబడిన ప్రదర్శనానికి తాలూకా తహశీల్దారు ప్రారంభోత్సవం చేశారు. వ్యవసాయశాఖ, ఆరోగ్యశాఖ, మత్స్యశాఖ, ఇంకా ఇతర శాఖలవారు తమ ప్రదర్శనశాలలను ఏర్పాటు చేశారు.

కరీంనగర్ ఉన్నతపాఠశాలలో మున్సిఫ్-మేజ స్ట్రేటు శ్రీ బంకట్‌లాల్ అధ్యక్షతన సభ ఏర్పాటు చేయబడింది. ఆ సందర్భంలో విద్యార్థులు ఏర్పాటు చేసిన ప్రదర్శనాన్ని స్థానిక శిబిర కార్యదర్శి శ్రీ వై. హనుమంతరావు ప్రారంభించారు.

గంగాధర జాతీయ విస్తరణ సేవాకేంద్రం ప్రధాన కార్యస్థానంలో ప్రణాళిక వారం జరుపబడింది.

ఉస్మానాబాదులో బాలబాలికలతో కనులపండువుగా ఊరేగింపు తీయబడింది. ఆ తరువాత జిల్లా కలెక్టరు శ్రీ జి. ఆర్. దేశపాండే అధ్యక్షతన సభ జరిగింది. జిల్లా కలెక్టరు ఒక ప్రదర్శనాన్ని ప్రారంభించారు.

ఉమెర్గా సామాజికాభివృద్ధి బ్లాకులో కూడా ప్రణా ళిక వారం జరుపబడింది.

మధిరలో ప్రభాత భేరీలతో ప్రణాళిక వారోత్స వాలు ఆరంభమయ్యాయి. క్లబ్బు భవనంలో తాలూకా తహశీల్దారు జాతీయపతాకాన్ని ప్రతిష్ఠించారు. ఒక ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. వినోద కార్య క్రమాలు కూడా జరిగినవి.

ఒక సామాజికాభివృద్ధి బ్లాకుకు ప్రధాన కేంద్ర మయిన వైరాలోకూడా ప్రణాళిక వారం జరుప బడింది.

వనపర్తి ఉన్నత పాఠశాలలో ప్రణాళిక వారో త్సవాలు జరిగాయి. ఆ సందర్భంలో ప్రభాతభేరీ, బహిరంగసభలు, ప్రదర్శనం, వక్తృత్వపోటీ, వ్యాస

రచనాపోటీ, వైజ్ఞానిక కార్యక్రమాలుకూడా ఏర్పాటు చేయబడినవి.

ఖమ్మం, పాలేరు, కూసుమంచి, జుజ్జులరావుపేట, నాయకులగూడెం మొదలగుచోట్ల ప్రణాళిక వారం జరుపబడింది. ఖమ్మంలో ప్రభుత్వోన్నత పాఠశాలలో బహిరంగసభ జరిగింది.

నిజామాబాదు పురమందిరంలో మునిసిపల్ అధ్యక్షుడు జాతీయ పతాకను ప్రతిష్ఠించడంతో అక్కడ ఈ వార్షికోత్సవాలు ప్రారంభమయినవి. ఒక ప్రదర్శనము ఏర్పాటుచేయబడింది. బహిరంగసభ జరిగింది. రుద్రూరు వ్యవసాయ పరిశోధనకేంద్రం ఉద్యోగులు తమ కేంద్రంలో జరిగిన పనులను వివరించి చెప్పారు.

సంగారెడ్డిలో ప్రణాళిక వారోత్సవాలను మెదకు జిల్లా కలెక్టరు శ్రీ బి. సి. ఆర్. విఠల్ ప్రారంభించారు. ఒక ప్రదర్శనం ఏర్పాటు చేయబడింది. పౌరులు ఊరేగింపుగా వెళ్లారు. బహిరంగసభ జరిగింది. ఉన్నత పాఠశాల విద్యార్థులు ప్రణాళికను గూర్చి బుర్రకథ చెప్పారు.

గుల్బర్గా, వరంగలు, సుల్తానాబాదు, నామాపురం, గంభీరరావుపేట, బుచ్చన్నపేట, సిరిసిల్ల, మంతెన మొదలగుచోట్ల ప్రణాళిక వారోత్సవాలు జరిగినట్లు వార్త లందినవి.

గుల్బర్గాలో ఉత్సవాలు ౧౯౫౬ సెప్టెంబరు ౩ వ తేదీనుంచి ఆరంభమయ్యాయి. వీటిని విజయవంతంగా జరుపడానికి అనేక విద్యా సంస్థలు, ప్రజా సంస్థలు శ్రద్ధగా పనిచేశాయి. మొదటిరోజు కార్యక్రమం శ్రీ శరణ బసవప్ప దేవాలయంలోజరిగింది. జిల్లా కలెక్టరు శ్రీ వాసుదేవరావు అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. వారు తమ అధ్యక్షోపన్యాసంలో మొదటి ప్రణాళికలో సాధింపబడిన అభివృద్ధిని సమీక్షించి, రెండవ ప్రణాళికను అమలు జరుపడంలో ప్రజలు సహకరించాలని విజ్ఞప్తి చేశారు. ఈ సందర్భంలో గుల్బర్గా జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు, శాసనసభ్యుడు అయిన శ్రీ చంద్రశేఖర పాటిల్ ప్రసంగిస్తూ స్వాతంత్ర్యం వచ్చినతరువాత దేశంలో జరిగిన అభివృద్ధిపనులను సమీక్షించారు.

మాజీమంత్రి శ్రీ జగన్నాథరావు చందర్కీ, గుల్బర్గా న్యాయవాది ప్రముఖుడు శ్రీ రాంపూరే గారలుకూడా ప్రసంగించారు.

గుల్బర్గాలో పంచవర్ష ప్రణాళిక ఉత్సవాలకు వ్యవహర్త, ప్రాజెక్టు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు అగు శ్రీ దస్తగిర్ ఖురేషీ కృతజ్ఞతాభివందనములు చెప్పారు.

మొదటిరోజు కార్యక్రమంలో కాశ్మీరు, భీమా వంతెనలనుగూర్చి ప్రదర్శించబడిన సినిమాలు చాలామంది ప్రేక్షకుల నాకర్షించాయి.

రెండవరోజునప్రదర్శనం గుల్బర్గాపట్టణం మధ్య భాగంలోవున్న పురమందిరంలోకి మార్చబడింది. ప్రతిరోజు వేలాదిప్రజలు వచ్చి ప్రదర్శనాన్ని చూచారు.

చివరిరోజు కార్యక్రమం మొసీంపురా మాధ్యమిక పాఠశాల మైదానంలో జరుపబడింది. ఆనాడు పాఠశాలల కార్యక్రమాలు ఏర్పాటుచేయబడినవి. వివిధ మాధ్యమిక పాఠశాలలనుంచి, బాలభట వేషములు ధరించి దాదాపు ౩౦౦ మంది బాలురు వచ్చారు. సంఘ సేవాధికారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. జిల్లాలోని వివిధశాఖల అధిపతులు మొదటి ప్రణాళిక కాలంలో తమతమ శాఖలు సాధించిన ఫలితాలను వివరిస్తూ ప్రసంగించారు.

ఔరంగాబాదులో ప్రణాళిక వారోత్సవాలు ౧౯౫౬ సెప్టెంబరు ౩ వ తేదీన ఆరంభమయ్యాయి. స్థానిక పాఠశాలల విద్యార్థులు ఉదయం సరస్వతీ భవన్‌వద్ద గుమిగూడి ప్రణాళిక అట్టలు చేతపట్టుకొని, ప్రణాళిక నినాదాలు చేస్తూ అక్కడనుంచి మైలుపొడవున ఊరేగింపుగా మునిసిపల్ టౌనుహాలుకు వెళ్ళారు. అక్కడ అన్ని రాజకీయ పక్షాలకు చెందిన స్థానిక నాయకులు, జిల్లాకలెక్టరు శ్రీ యస్. ఏ. యల్. రజ్వీ ఐ. ఏ. యస్., ఇతరులు వారికి స్వాగతమిచ్చారు.

ప్రణాళిక వారోత్సవములకు వ్యవహర్త శ్రీ ఆర్. ఆర్. మంత్రాంకర్ విద్యార్థులను, ఉపాధ్యాయు

లను అభినందిస్తూ మనదేశపు మొదటి రెండవ ప్రణాళికల ముఖ్యాంశాలను వివరించారు.

జిల్లా కలెక్టరు శ్రీ యస్. ఏ. యల్. రజ్వీ తమ ప్రారంభోపన్యాసంలో మొదటి ప్రణాళికలో వ్యవసాయానికి ప్రాధాన్య మివ్వబడిందనీ, రెండవ ప్రణాళికలో భారీ పరిశ్రమలకు ముఖ్యస్థానం గలదనీ అన్నారు. భారతదేశంవంటి ప్రజాస్వామిక దేశంలో ప్రజలు తమ బాధ్యతలను గుర్తించాలని వారు విజ్ఞప్తిచేశారు.

సమాచార పౌర సంబంధములశాఖ ఏర్పాటు చేసిన ప్రదర్శనాన్ని శాసనసభ్యులు శ్రీ నాగోరావు పాఠక్ ప్రారంభిస్తూ అటువంటి ప్రదర్శనములవల్ల ప్రజలు తమదేశ విషయాలను తెలుసుకోవడానికి ఎక్కువ వీలుపడుతుందని అన్నారు.

మొదటి, రెండవ ప్రణాళికలలో తాము అమలు జరిపిన కార్యక్రమాలనుగూర్చి ప్రజలకు తెలియజెప్పడానికై ప్రణాళిక వారోత్సవముల కమిటీవారు ఆ యా అధిపతుల ఉపన్యాసములను ఏర్పాటుచేశారు.

సెప్టెంబరు ౪ వ తేదీన ప్రత్యేక సంఘ సేవాధికారి శ్రీ ఫైజీ తమశాఖయొక్క కార్యకలాపాలను వివరించారు. జిల్లా సంఘసేవాసమితి అధ్యక్షురాలు డాక్టర్ సత్యవతిశ్రాఫ్ తమ సమితియొక్క కార్యక్రమాలను వివరించిచెప్పారు. సెప్టెంబరు ౫ వ తేదీన సహకార సంస్థల ఇన్‌స్పెక్టర్ శ్రీ నసీరుద్దీన్ హైదర్ వివిధరంగములలో సహకారశాఖ చేస్తున్న కృషిని విశదీకరించారు. అధ్యక్షత వహించిన డా. గోపాల్‌దాస్ శ్రాఫ్ సహకార కార్యకలాపాలను ఇంకా ఎక్కువగా ప్రోత్సాహ మివ్వవలసిన ఆవశ్యకతను నొక్కిచెప్పారు.

సెప్టెంబరు ౬ వతేదీన జిల్లాస్కూళ్ళ ఇన్‌స్పెక్టరు శ్రీ మోషే, ఔరంగాబాదు పాలీ టెక్నిక్‌కుచెందిన శ్రీ అతూరుజ్జమాన్ తమ శాఖల కార్యకలాపాలను వివరించారు. ఆర్ట్సు, సైన్సు కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ జి. యన్. భట్టే అధ్యక్షత వహించారు.

సెప్టెంబరు ౭ వ తేదీన వ్యవసాయశాఖ అసిస్టెంటు డైరెక్టర్ శ్రీ తల్నీకర్ అసిస్టెంటు హార్టీకల్చరిస్టు శ్రీ మొహిబుల్లా ఫారూఖీ తమ శాఖలు సాధించిన అభివృద్ధినిగూర్చి చెప్పారు. సభకు జిల్లా కలెక్టరు శ్రీ రజ్వీ అధ్యక్షత వహించారు.

సెప్టెంబరు ౮ వతేదీన వాణిజ్య పరిశ్రమల సూపరింటెండెంటు శ్రీ ముబారకలీఖాన్, రోడ్ల ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ అబ్దుల్ కదీర్, ఇరిగేషన్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు శ్రీ సథే, జిల్లా పశువైద్య శాఖాధికారి డా. బి.కె. దేశపాండే తమ శాఖల కార్యకలాపాలను చెప్పారు. పబ్లికు వర్క్సుశాఖ సూపరింటెండింగ్ ఇంజనీరు శ్రీ ఫరహతుల్లా సభకు అధ్యక్షత వహించారు.

సెప్టెంబరు ౯ వ తేదీన స్థానిక ప్రభుత్వశాఖలు ఔరంగాబాదు వీధులగుండా ప్రచార శకటముల ప్రదర్శనాన్ని తీసినవి. ప్రణాళిక పోటీలలో విజయం పొందిన విద్యార్థులకు బహుమతులివ్వడానికై పురమందిరంలో ఒక సభ ఏర్పాటుచేయబడింది. శ్రీమతి రజ్వీ దాదాపు ౧౨౦ బహుమతులను ఇచ్చారు.

ఈ క్రింది స్థలాలలో పంచవర్ష ప్రణాళిక వారోత్సవాలు జరిగినట్లు వార్తలు చేరినవి.

నిజామాబాదు, ఉస్మానాబాదు పట్టణం, ఉమెర్గా, ఉస్మానాబాదు జిల్లాలోని ఇతర గ్రామాలు, కలంనూరి పట్టణం, మెట్టుపల్లి జాతీయ విస్తరణ సేవాకేంద్రం, సింధ్‌నూరు, ఆష్టి జాతీయవిస్తరణ సేవాకేంద్రం, వరంగలు (హనుమకొండ)లోని ప్రభుత్వ బి. ఇడి. కళాశాల, యాద్గీరు సామాజికాభివృద్ధి కేంద్రం, పర్కాల, బోధన్, మోస్రా, బాస్వాడా సామాజికాభివృద్ధి కేంద్రం, మెదకుజిల్లా నర్సాపూరు జాతీయవిస్తరణ సేవాకేంద్రం, గుల్బర్గా జిల్లాలోని చితాపూరు, అఫ్జల్‌పూరు, హుజూరాబాదు జాతీయవిస్తరణ సేవాకేంద్రం, ఆందోలు తాలూకా పటన్‌చెర్వు సామాజికాభివృద్ధి కేంద్రం, భార్కి- కొల్లాపూరు జాతీయ విస్తరణ సేవాకేంద్రం, బస్మత్ బీడ్ జిల్లాలోని కైజ్, వైజాపూరు జాతీయ విస్తరణ సేవాకేంద్రం, కన్నడ్ సామాజికాభివృద్ధి కేంద్రం, లింగుస్గూర్, నాందేడు, కొత్తగూడెం, బూర్గుంపాడు.

## వనపర్తిలో....

మహబూబ్‌నగర్ కలెక్టరు శ్రీ శ్రీనివాసన్, ఐ. ఏ. యస్., వనపర్తి ఉన్నతపాఠశాల ఆవరణలో జరిగిన ప్రణాళిక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. ప్రదర్శనంలో తాలూకాలోని అన్ని ప్రభుత్వ కార్యాలయాలు పాల్గొన్నవి. ప్రసిద్ధ సాహితీ పరులు తదితరుల ఉపన్యాసములు కూడా ఈ సందర్భంలో జరుపబడినవి. విద్యార్థులు, ఉద్యోగులు హరిజనవాడలో సాంఘిక సేవా కార్యక్రమంలో పాల్గొని ఒక మైలు అప్రోచ్‌రోడ్డు కూడా వేశారు. స్థానిక తహశీల్దారు శ్రీ కె. నరసింహారావు, ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు శ్రీ ఎ. జె. సోమ సుందరంగారల కృషి ఫలితంగా ఈ వారోత్సవం జయప్రదంగా ముగిసింది.

---

## * రాష్ట్ర విచ్ఛిత్తి : నవరాష్ట్ర అవతరణ *

[ ౩ వ పుట తరువాయి ]

బ్రిటీషిండియాలో రాజకీయంగా వస్తున్నమార్పుల ప్రభావంగా హైద్రాబాదులో కూడా చైతన్యం కలిగింది. పరిపాలనా సంస్కరణలు జరుగవలెననీ, ప్రభుత్వాధికారం మార్పుచేయబడవలెననీ కొందరు కోరినారు. అనధికారసంస్థలు పనిచేయ నారంభించినవి. కాని మజ్లిసె- ఇత్తెహాదుల్ముసల్మీను అను మత సంస్థ బుద్ధిపూర్వకంగా ప్రతిఘటించడంచేత అనధికార సంస్థల కృషికి ప్రతిబంధక మేర్పడింది. బహద్దుర్ యార్జంగ్ నాయకత్వమున ఇత్తెహాదుల్ ముసల్మీను సంస్థ 'ముస్లింరాజ్యం' అనే సిద్ధాంతాన్ని ప్రచారంచేస్తూపోయింది. ఈ ప్రచారంలో వారికి బ్రిటీషిండియానుంచి కూడా మద్దతు లభించింది. సంస్థానంలో నూటికి ౧౩ వంతులమంది చొప్పున వున్న ముస్లిములకు, నూటికి ౮౭ వంతులమంది ఉన్న ముస్లిమేతరులకు ప్రభుత్వంలో సరిసమాన స్థానములుండవలెనని ఆ మతసంస్థ కోరింది. కాని స్టేట్ కాంగ్రెసు, ఇతర ముస్లిమేతర సంస్థలు ఆ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించాయి. నిజాం ప్రభుత్వము అనేక వాగ్దానములుచేసి కూడా చివరకు ఇత్తెహాద్ సంస్థ ప్రతిపాదన ప్రకారమే సంస్కరణలను ప్రకటించింది. ఈ ప్రతిపాదన ప్రకారం ఏర్పాటైన శాసన సభను ముస్లిమేతర సంస్థలు వట్టి బూటకంగా భావించినవి. బహద్దుర్‌ఖాన్ తరువాత ఇత్తెహాదుల్ ముసల్మీను సంస్థకు నాయకత్వం వహించినవారు పై ప్రతిపాదన అమలు జరిగినందుకు మిక్కిలి ఉత్సాహవంతులై తామే మంత్రిమండలి నిర్మాతలు కావలెనని అభిలషించారు. కొద్దికాలంవరకు వారు అటువంటి నిర్మాతలయ్యారు కూడా. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఇండియన్ యూనియన్‌లో హైద్రాబాదు ప్రవేశం కొరకు వైస్రాయి లార్డు మౌంట్‌బాటన్ ఎంతగా కృషిచేసినా అందుకు నిజాం అంగీకరించలేదు. లాయకలీ హైద్రాబాదు ప్రధానమంత్రి అయినాడు. అనేక సంప్రదింపులు జరిగినవి. రాయబారాలు నడచినవి. చివరకు పరిస్థితి విషమించగా ౧౯౪౮ సెప్టెంబరులో పోలీసుచర్య జరుపడం అవసరమయింది. ఆ సంఘటనలన్నీ పాఠకులకు సుపరిచితమైనవి.



# హైదరాబాదులో వన్యమృగములు

వన్యమృగముల పరిరక్షణకై ఏర్పాటుచేయబడిన భారత సంఘం (ఇండియన్ బోర్డు) ఆదేశానుసారం హైదరాబాదు రాష్ట్రమంతటా ఈనెల వన్యమృగముల వారం జరుపబడుతున్నది.

భారతదేశపు అడవులలో వివిధరకముల పశుపక్ష్యాదులు గలవు. దేశసహజ సంపదలో ఇవికూడా చేరియున్నవి. అక్టోబరునుంచి మార్చినెలవరకు సైబీరియా, మంగోలియా, తుర్కిస్తాన్ మున్నగు ఉత్తరప్రాంత దేశములనుంచి అనేకరకముల పక్షులు మన దేశమునకు వలస వస్తూ ఉంటాయి. హైదరాబాదు రాష్ట్రములోకూడా ఇట్టి సహజసంపద విశేషముగా గలదు. రాష్ట్ర పూర్వార్థ భాగములోఉన్న ఆదిలాబాదు, కరీంనగరు, వరంగల్, ఖమ్మం, నిజామాబాదు, మహబూబునగరు జిల్లాలలో చాల దట్టమైన అడవులు గలవు. ఇక్కడ కొన్ని టేకు, కలప చెట్లు ౬౦ నుంచి ౧౦౦ అడుగులవరకు కూడా ఉంటాయి. ఈ అడవులలో శాకాహారమృగములకు, మాంసాహారమృగములకు సమృద్ధిగా ఆహార పానీయములు లభిస్తాయి.

హైద్రాబాదు అడవులలో ముఖ్యంగాఉండే జంతువులు ఇవి : పెద్దపులి, చిరుతపులి, తోడేలు, సివంగి, అడవికుక్క, ఎలుగు, యెనుబోతు, నిల్గాయి, జింక, సాంబారు, నల్లజింక, గోరల్, చింకారా, కుందేలు, మొరిగే జింక, పెద్ద ఉడుత, దుప్పి, అడవిపంది మున్నగునవి.

రాష్ట్రమంతటా అనేక చెరువులు, సరస్సులు, కుంటలు ఉన్నందువల్ల, వాటిల్లో అన్నిరకాల నీటి కోళ్లు విశేషంగా లభిస్తాయి. అడవులలో పచ్చ పావురం, మచ్చల పావురం, అడవి పావురం, ఎఱ్ఱ అడవికోడి, తాంబేలురంగు పావురం, నీలి పావురం, కోలంకి పిట్ట, తిత్తిరి పిట్ట, బూడిదరంగు కౌజు, రక్తవర్ణపు అడవిపెట్ట, నానా విధములైన అడవి కొంగలు, పచ్చరంగి పిట్ట, పెద్ద ఉల్లంకి, ఉల్లాము పిట్ట, అడవి బాతు, నీలిరెక్కల బుడ్డబాతు మొదలగునవి కనిపిస్తాయి. పెద్దపెద్ద చెరువులలో మొసళ్లు, పెద్ద చేపలు కూడా ఉన్నాయి.

## వన్యమృగ కేంద్రములు

హైద్రాబాదు ప్రభుత్వ అటవీశాఖ మూడుచోట్ల అంటే పాఖాల (౩౩౫ వ. మై.), పోచారం (౫౦ వ. మై.), ఏటు నాగారం (౩౧౪ వ. మై.) ప్రాంతములలో వన్యమృగ కేంద్రములను ఏర్పాటుచేసింది. మొదటి రెండు కేంద్రాలు వరంగల్ జిల్లాలోను, మూడవది మెదకు జిల్లాలోను ఉన్నాయి. ఈ మూడు కేంద్రాలలో ఉన్న విశ్రాంతి గృహములలో వంటకు వలసిన పాత్రలన్నీ లభిస్తాయి. ఇవేగాక పి. డబ్ల్యు. డి. వారి విశ్రాంతి గృహములు, లోకల్‌బోర్డువారి బంగళాలుకూడా అడవులకు సమీపంలోనే ఉన్నాయి. ఇక్కడికి ప్రకృతి సౌందర్యమును చూచుటకు వచ్చు వారికీ, వేటాడుటకు వచ్చువారికీ స్థానిక అటవీశాఖ సిబ్బందివారు ఎల్లప్పుడు కావలసిన సహాయం చేస్తారు. కెమేరాతో ముఖ్యంగా మూవీ కెమేరాతో ఇక్కడ సంవత్సరం పొడుగునా మంచి ఫోటోలు తీసుకోవచ్చును. వన్యమృగములను తుపాకితో వేటాడుటకు ప్రతి సంవత్సరం మార్చి ౧ నుంచి మే ఆఖరువరకు సులభమైన షరతులపై అనుమతి ఇవ్వబడుతుంది. అయితే అందుకుగాను లైసెన్సు ఫీజు కొరకు, పెద్దపులిని వేటాడుటకు డబ్బును డిపాజిట్టు కట్టవలెను. అడవులలో పక్షులను వేటాడకూడదు. అయితే ఈ పక్షులను శీతకాలంలో అడవులకు దూరంగా బైటి ప్రాంతాలలో వేటాడవచ్చును.

మనదేశంలో ప్రకృతి ప్రసాదించిన ఇట్టి సహజ సంపదను తగు పద్ధతిలో పరిరక్షించి, అభివృద్ధి పరచుటకై వన్యమృగ వారోత్సవం జరుపబడు తున్నది. పురాతనకాలంలో సమస్త జీవకోటికి ఆదరణ వుండేది. మన ఋషీశ్వరుల ఆశ్రమములలో గొర్రెలు, దూడలతోపాటు సింహములు, పెద్దపులులు కూడా పెంచబడుతుండేవని వింటున్నాము. అయితే ఆ కాలం పోయింది. పాశ్చాత్యదేశాలతో సంబంధాలు కల్పించుకున్నాము. ఐరోపాదేశములలో మన దేశపు కలప ట్రోఫీలు, జంతువుల చర్మములు, తోళ్లు విశేషంగా అమ్ముడుపోతాయి. అందువల్ల మనం అడవులను కొట్టివేస్తూ వచ్చినాము. తత్ఫలితంగా అడవిమృగములు క్రమేణా అరుదై, నశించిపోయినాయి. సింహము, ఖడ్గమృగము, చిరుతపులి మున్నగు ముఖ్యమైన జంతువులు అంతరించిపోతున్నవి. అందువల్ల కలిగే ప్రమాదమేమంటే, వన్యమృగములు సహజ నివాసస్థలములను పోగొట్టుకొని, మనుష్యులు నివసించే ప్రాంతాలలో తిరుగుతూ, మనకు ప్రాణనష్టం కలిగిస్తాయి. ఉత్తరప్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో తోడేలు, సివంగి జంతువులు మనుష్యులకు ప్రాణహాని కల్గిస్తున్నవని వింటూన్నాం.

కనుక వన్యమృగముల పరిరక్షణకై అవసరమైన చర్యలు గైకొనటం ఎంతో ముఖ్యం. ఇతరదేశాల నుంచి క్రొత్తగా అడవిమృగములను తెచ్చి పెంచడం కూడా అవసరం. వేటకు పోవువారందరు సాధ్యమయినంత తక్కువ జంతువులను చంపాలి. అయితే చంపకుండా ఉండడం మాత్రమే సరిపోదు. వాటిని తగురీతిగా పరిరక్షించాలి. రోగముతో బాధపడుతూ, హుషారుగాలేని జంతువు ఇతర జంతువుకు ఆహారమవుతుంది. మాంసాహార జంతువులలో కూడా,



*పొదలోనుంచి బయటికి వస్తున్న పెద్దపులి*

[ఎగువ] జంతువుపై బడి దానిని చంపుతున్న పెద్దపులి. [దిగువ] ఆహారంకోసం చూస్తున్న చిఱుతపులి.



*కోపోద్రిక్తమైన బెబ్బులి*

ఆహారము లభించకపోతే జీవించవు. ఈ విధంగా మనగలుగుటకై జరుగు ఈ పోరాటంలో బ్యాలెన్సును నిలబెట్టడమే ప్రకృతిపద్ధతి. శాకాహార, మాంసాహార జంతువులు తమ ఆహారంపైననే ఆధారపడుతాయి. శాకాహార జంతువులు వాటికి ఇష్టమైన గడ్డినిగానీ లేదా ఆకులు వగైరా తింటాయి. వాటికి ఆహారం అరుదైనపుడు ఆహారాన్వేషణకై ఇతర ప్రాంతాలకు వలసపోతాయి. వాటికి ఆహారం సమృద్ధిగా లభించక పోతే అవి వృద్ధికావు. బలహీనమైనవి చనిపోతాయి. ఈవిధంగా అడవులలో జంతువుల సంఖ్య సర్వ పరిస్థితుల కనుగుణంగా, సహజంగానే సర్దుబాటు అవుతుంది. మాంసాహార మృగములలో కూడా ఇట్టి పరిస్థితులు కలుగుతూ ఉంటాయి. కనుక ఈ రెండు రకాల జంతువులకు వాటికి వలసిన ఆహారం లభించు నట్లు చూడడం అవసరం.

వేటకుపోవువారికి, జంతువులను చంపడంకన్నా, వాటిని తరిమి కేమేరాతో ఫోటోలు తీసుకోవడం ఉల్లాసంగా ఉంటుంది. ఈవిధంగా ఫిల్ములరూపంలో సజీవమైన జంతువుల ఫోటోలు తీసుకొనుటకు వీలుంటుంది.



# భారత దేశంలో దశాంశపద్ధతి నాణెములు

హెచ్. యం. పటేల్, ఐ. సి. ఎస్.

భారతదేశంలో దశాంశపద్ధతిని ప్రవేశపెట్టాలని గత కొన్ని దశాబ్దాలుగా సూచనలు చేయబడుతూ వచ్చినాయి. కాని ఏదో ఒక కారణంవల్ల ఇది వెనక పడుతూ వచ్చింది. ౧౮౬౯ వ సంవత్సరంలోనే ఈ విషయంపట్ల విశేషమైన శ్రద్ధ గైకొనబడింది. పరిస్థితులు క్షుణ్ణంగా పరిశీలించిన తరువాత దేశంలో క్రమేణా దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిర్ణయించింది. ౧౮౭౧ వ సంవత్సరంలో ఆమోదించబడిన చట్టం అనేక కారణాలవల్ల అమలుపరచ బడలేదు. నాణెములకంటె ముఖ్యంగా కొలతలు, తూకములను ప్రమాణీకరణం చేయడం అవసరమని భావించబడింది. ౧౯౫౧ వ సంవత్సరంలో దేశమంతటా శాంపుల్ సర్వే చేసినప్పుడు ౧౧ వందల గ్రామాలలో ౧౪౩ రకాల కొలతలు, తూకములు చలామణిలో ఉండినట్లు కనుగొనబడింది. కొలత పాత్రలలోను, భూముల కొలతలలోను ఎన్నో అవకతవక లున్నాయి. అందువల్ల ఈ పరిస్థితులను తొలగించి దేశమంతటా ఒకే పద్ధతిని అమలుపరచుటకు ప్రభుత్వం చర్యలు గైకొనవలసి వచ్చింది.

౧౯౩౯ వ సంవత్సరంలో తూకముల ప్రమాణముల చట్టాన్ని అమలు పరచడంతో ఈ విషయంలో ఒక అడుగు ముందుకువేశాము. కాని దశాంశ పద్ధతిని ప్రవేశపెట్టుటకు ఈ చట్టంలో తలపెట్టబడలేదు. ఇప్పుడు దేశంలో దశాంశపద్ధతిని ప్రవేశపెట్టుటకు లోకసభ అంగీకరించి, అవసరమైన శాసనాన్ని ఆమోదించింది. ఇంత పెద్దమార్పు తీసుకొనివచ్చే విషయమై ప్రజాభిప్రాయం కొంత అనుకూలంగానూ, కొంత అననుకూలంగానూ ఉంది. అయితే మొత్తంమీద ప్రజాభిప్రాయం దశాంశపద్ధతి వైపే మొగ్గుతున్నదని చెప్పవచ్చును. మెట్రిక్ తూకములు, కొలతలు ప్రవేశపెట్టుటకు కొంతకాలం పడుతుంది. ఇకముందు జరిగే పరిణామాలపైన శాసనరీత్యా తగు చర్య గైకొనడం ఆధారపడి వుంటుంది. అయితే నాణెముల విషయంలో పని చురుకుగా కొనసాగుతున్నది. ౧౯౫౭ ఏప్రెల్ ౧ నాటికి ఈ చట్టం అమలుపరచబడుతుందనీ గట్టిగా విశ్వసించబడుతున్నది.

## సాధ్యమైనంత సులభపద్ధతి

ప్రపంచమంతటా పాతనాణెముల స్థానే క్రమేణా దశాంశ పద్ధతిని ఉపయోగించడానికి కారణమేమి? అన్న ప్రశ్న సహజంగా కలుగుతుంది. ఇందుకు జవాబు స్పష్టమే. ఇంతకంటే సులభమైనపద్ధతి ఇంకొకటిలేదు. దశాంశపద్ధతిలో సులభంగాను, త్వరగాను లెక్కలు కట్టవచ్చును. ప్రస్తుత రాజకీయ వ్యాపార పరిస్థితులలో సులభపద్ధతిలో త్వరగా లెక్కకట్టడం అవసరమవుతున్నది. అందుకు దశాంశ పద్ధతివినా వేరే పద్ధతిలేదు. బడిలో చదువు పిల్లవానికి ఈ పద్ధతి సులభమైనది కాదనే అనుకుందాము. అయితే బడి పంతులు వివిధ పద్ధతులైన పౌనులు, షిల్లింగులు, పెన్నీలు మున్నగు వాటినిగూర్చి, వివిధ పద్ధతులలో వున్న తూకములు, కొలతలను గూర్చి బోధిస్తూనే ఉంటాడుగదా.

## రూపాయియొక్క కొత్త విభాగములు

రూపాయ, అర్ధరూపాయ, పావలా నాణెములకు ప్రస్తుతవిలువలే ఉంటాయి. అయితే రూపాయ

# కొత్తనాణెములు
























నూరు యూనిట్లలో విభజింపబడి ఉంటుంది. ప్రతి యూనిటు నయా పైసా అని పిలువబడుతుంది. అర్థ రూపాయలో ఏభై, పావలాలో ౨౫ నయాపైసలు ఉంటాయి. సాధారణంగా యూనిట్లను సెంట్ అనో లేక హిందీలోకాని, సంస్కృతంలోకాని దాని అర్థమిచ్చు పేరుతోనో పిలువవలసి ఉంటుంది. పైసా అనే పేరునే ఉంచాలని ప్రజాభిప్రాయమై ఉండుట వల్ల తక్కువ చదువుకున్న ప్రజలకు నయాపైసా అనే పేరు కొంత అయోమయంగా ఉన్నప్పటికీ అదే పేరు ఉంచబడింది. క్రొత్తనాణెముల ఆకారం, పరిమాణం కూడా కొత్తగా ఉండటంవల్ల ప్రజలు వాటికి అలవాటుపడాలంటే కొంతకాల పడుతుంది. ప్రస్తుతం ఉండే రెండణాలు, అణా, అర్థణా, కానీ నాణెములు ఇకమీదట ఉండవు. కాని వాటిస్థానే పది, ఐదు, రెండు, ఒకటి నయాపైసల నాణెములు ఉంటాయి. మెట్రిక్ పద్ధతిలో తూకములు, కొలతలకు అనువుగా ఉండునట్లుగానే కొత్త నాణెముల డిజైనును తయారుచేయుటకు తలపెట్టబడింది.

కొత్త నాణెములు అమలులోకి వచ్చునపుడు అణాబిళ్లలు ఉండవు. విలువలో అణాకు సమానమైన నాణెము లేనందువల్ల దానిని ఉపసంహరించడం తప్పనిసరి అవుతుంది. అంతేగాక ఇప్పటి అణా బిళ్లలు చలామణిలో ఉంచే ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవలసివస్తుంది. అయితే నయాపైసా వచ్చిన కొంతకాలం తరువాత తిరిగీ అణాను ఉపయోగం లోకి తీసికొనిరావడానికి ప్రతి బంధకం ఉండదు. దానివిలువ అమెరికాలోవలె ఐదు పైసలకు సమానంగా ఉంటుంది. ఈ నాణెములకు అణా అని పేరుండదు. పదిసెంట్లు, ఐదుసెంట్లు అను పేర్లు ప్రచారంలోకి వస్తాయి.

## నాణెముల ఉపసంహరణ దశలు

ఇప్పటి నాణెముల స్థానే కొత్త నాణెములను అమల్లోకి తీసికొనిరావడం అంత సులభమైన పని కాదు. కొత్త నాణెములను లక్షల సంఖ్యలో ముద్రించి వాటిని దేశమంతటా గల పోస్టాఫీసులు, రైల్వే స్టేషన్లు, బ్యాంకులు మున్నగు ముఖ్య కేంద్రాలకు పంపవలసి ఉంటుంది. అప్పటినుంచి క్రమేణా పాత నాణెములను ఉపసంహరించుటకు ఏర్పాట్లు చేయబడవలసి ఉంటాయి. ఈ ఏర్పాట్లలో కూడా కార్యక్రమ నిర్వహణకు సంబంధించిన ఇబ్బందులుంటాయి. ఉపసంహరణ వల్ల ఏ సందర్భంలో కూడా తాత్కాలికంగానైనా సరే నాణెముల కొరత ఏర్పడకూడదు. కనుక పాత నాణెముల ఉపసంహరణ కార్యక్రమం మొదలు క్రమేణా జరుగుతూ ఆ తర్వాత కొత్త నాణెములు అధిక సంఖ్యలో తయారైనపుడు శీఘ్రంగా కొనసాగాలి. ఈ సందర్భంలో గమనించవలసిన విషయమేమిటంటే అన్ని ప్రాంతాలకు కొత్త నాణెములు వలసినంతగా లభించునట్లు తగు ఏర్పాట్లుండాలి. ఏది ఎట్లయినా కొంతకాలం వరకు పాత నాణెములను మామూలు స్థాయిలో చలామణిలో ఉంచుతూ కొత్త నాణెములకు కూడా స్థానం కల్పించాలి.

## స్టాంపులు, సుంకముల రేట్లు

దశాంశపద్ధతి నాణెములు అమల్లోకి వచ్చునపుడు తంతి, తపాలా శాఖకు అనేక సమస్యలు కలుగుతాయి. అది సాధ్యమైనంత త్వరలో ఒకవైపు ప్రస్తుత నాణెముల విలువలో క్రొత్త స్టాంపులను అచ్చువేయకుండా పూర్తిగా నిలిపివేసి, మరొకవైపు కొత్త నాణెముల విలువలో స్టాంపులను అచ్చువేయుటకు కృషి చేయవలసి ఉంటుంది. పోస్టాఫీసులలో కొత్త స్టాంపులను నిలువ ఉంచుటకు, పాతవాటిని ఉపసంహరించుటకు ఒక సమగ్రమైన కార్యక్రమం రూపొందించాల్సిఉంటుంది. ఇప్పుడుఉన్న స్టాంపులు ఇకమీదట చెల్లవని ప్రకటించుటకు ముందు ఆ విషయం ప్రజలకు ముందుగానే తెలియజేయబడుతుంది. రైల్వేలకు గూడా కొన్ని సమస్యలు తలెత్తుతాయి. రైల్వేలు కొత్త నాణెముల విలువలో ప్రయాణీకుల రేట్లను, రవాణా రేట్లను మార్చవలసి ఉంటుంది. కొత్త రేట్లను నిర్ణయించుటకు లెక్కలు కట్టినంత మాత్రాన సరిపోదు. రేట్లను న్యాయసమ్మతంగా,

సమంజసంగా నిర్ణయించవలసి ఉంటుంది. రేట్లలో పైసలను తీసివేయవలసి వచ్చినపుడు వాటిని పెంచవలసి వస్తుంది. కొన్ని సందర్భాలలో రేట్లు తగ్గించబడుతాయికూడా. ఈ మార్పులను అమలుపరచడం వల్ల ఇటు ప్రభుత్వానికీ, అటు ప్రజలకూ నష్టం కలుగకుండునట్లు తగు జాగ్రత్త వహించవలసి ఉంటుంది. ఈ సందర్భంలో ఏమైనా ఇబ్బందులు, కష్టాలు వుంటే వాటిని బలవంతులు మాత్రమే తమ భుజాలపైనవేసుకోవాలి. కానిబలహీనులు వాటికి లోను కాకూడదు. ప్రైవేటు, ప్రభుత్వ రవాణాసంస్థలు కూడా ఇట్టి మార్పులే చేయవలసి ఉంటాయి. ఇవి ఎదుర్కొనే సమస్యలు కూడా ఎక్కువగాకానీ, క్లిష్టంగా కానీ ఉండవు. బ్యాంకులు కూడా కొన్ని సమస్యలు ఎదుర్కోవలసి ఉంటుంది. క్రొత్త నాణెములను ప్రవేశపెట్టుటకు పూర్వమే అవి ముందుగానే ఈ విషయంలో తగు చర్యలు గైకొనాలి. ఉదాహరణకు క్రొత్త అకౌంటు పుస్తకాలలో అంకెలు వ్రాయడానికి వివిధ ఖానాలుండాలి. తదనుగుణంగా పుస్తకాల సైజు కూడా మారవలసి ఉంటుంది. ఈ మార్పులవల్ల ముద్రణ శాలలకు కొన్ని నెలలపాటు చేతినిండా పని ఉంటుందని చెప్పవచ్చును. అయితే అవి అధిక లాభకాంక్షతో పని చేయవనే ఆశిద్దాము. దూరదృష్టి లేక ఆఖరి క్షణం వరకూ లెక్కలపుస్తకాల అచ్చుకు ఆర్డర్లు ఇవ్వకపోతే నష్టం భరించాల్సి వస్తుంది.

నాణెముల మార్పు తీసుకొనిరావడం అంత సులభమైనపని కాదని స్పష్టపడుతున్నది. దీనివల్ల ఇబ్బంది పడేవారు చాలా తీవ్రంగా ఆలోచించవలసిఉంటుంది. ప్రజలందరూ ముందుగానే తమకు కలుగు సమస్యలు ఊహించి తదనుగుణంగా వాటిని పరిష్కరించుకొన్నట్లయితే నాణెముల మార్పు సక్రమంగా, సమర్థవంతంగా తీసికొని రాబడుతుందనడంలో సందేహం లేదు. నాణెముల మార్పువల్ల ఏదో ఒక వ్యక్తికో లేక సంస్థకో గాక దేశం మొత్తానికి బోలెడంతడబ్బు ఖర్చవుతుంది. దశాంశపద్ధతి వల్ల అనేక లాభాలు కలుగుతాయనే విషయం స్వల్ప కాలంలోనే తెలియగలవని మార్పు కోరేవారందరు విశ్వసిస్తున్నారు.

## కొలతలు, తూకములు

భారతదేశంలో మెట్రిక్ తూకములు, కొలతలను ప్రవేశపెట్టే విషయమై కొంత చెప్పాల్సివుంది. ఈ పద్ధతివల్ల ప్రజలందరికీ అనేక లాభాలుంటాయి గనుక సాధ్యమైనంత త్వరలో ఈ మార్పును తీసికొనిరావలసి ఉంటుంది. నాణెములవలెనే, కొంతకాలమువరకు పాతకొలతలు, తూకములు క్రొత్తవాటితోపాటు అమలులో ఉండవలసి వుంటుంది. ఆరంభంలో కొద్దిపాటి ఇబ్బందులను ఎదుర్కొనుటకు సిద్ధపడితే త్వరలో మెట్రిక్ పద్ధతి ప్రవేశపెట్టుటకు సాధ్యమవుతుంది.

లోగడ ఒకసారి ఈ పద్ధతిని ప్రవేశపెట్టుటకు నిర్ణయించబడిందనే విషయం మనం మరువకూడదు. ఈ నిర్ణయాన్ని అమలుపరచుటకు ఒక శాసనంకూడా తయారుచేయబడింది. ఇది ౧౮౭౧వ సంవత్సరమునాటి మాట. అయితే అప్పుడు అనేక ఇతర ముఖ్య సమస్యలుండటంవల్ల ఏలాంటిచర్య కూడా తీసుకోబడలేదు. ఎక్కువ కష్టంలేకుండా క్లిష్టసమస్యలను పరిష్కరించాలంటే వ్యవధి ఉండాలి. ఈ వ్యవధివల్ల మనం కష్టాలను దాటుకోలేకపోవడం కూడా కద్దు. దీని పర్యవసాన మేమంటే బృహత్సమస్యలను పరిష్కరించుటకు మనకు దుష్కరమవుతుంది.

తూకములు, కొలతల సంస్కరణను అమలుపరచాలని చాలా కాలంనుంచి ప్రయత్నించబడుతున్నది. క్రొత్త పద్ధతిని ప్రవేశపెట్టుటకు ప్రభుత్వంచేయు కృషికి ప్రజలు తోడ్పడమేకాక ఈ సంస్కరణను త్వరగా ప్రవేశపెట్టుటకు స్వయంగా వారే కోరగలరనికూడా ఆశింపబడుతున్నది. ఏక కాలంలో మెట్రిక్ పద్ధతిని ప్రవేశపెట్టుటకు సమయానికై వేచివుండడం వల్ల వృథాకాలయాపన అవుతుంది. ప్రజలు ఎన్నో రకాల మణుగులతో వ్యవహరించవలసిరావడంసమంజసమైన విషయంకాదు. ఇన్నిరకాలుండడంవల్ల చిక్కులేర్పడుతాయి తప్ప మరేలాంటి ప్రయోజనం ఉండబోదు. ఇప్పుడువున్నమణుగులలోఅన్నిటికంటె

[తరువాయి ౩౩ వ పుటలో]

# ★ వార్తా చిత్రాలు ★



విరిగి ముక్కలైపోయిన ఒక పెట్టెతాలూకు భాగం. వాగుయొక్క వరదవేగానికి ఇది ప్రమాదం జరిగిన స్థలంనుంచి పది మైళ్ళ దూరం కొట్టుకుపోయింది.



రైలుప్రమాదం: సెప్టెంబరు 1 వ తేదీ రాత్రి జడ్చర్ల — మహబూబునగర్ స్టేషనుల మధ్య అప్పనపల్లి గ్రామానికి సమీపంగా ప్యాసింజరు బండి ఘోరప్రమాదానికి లోనుకాగా ఇంజను, ముందుపెట్టెల దృశ్యం. ఈ ప్రమాదంలో విరిగిపోయిన పెట్టెల కుప్పలనుంచి 122 శవాలు వెలికి తీయబడినవి. [దిగువ] విరిగి ముక్కలైపోయిన పెట్టెలు, ఇంజను.



రైలు ప్రమాద స్థలాన్ని చూస్తున్న రైల్వేమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, హైదరాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు.
[దిగువ] రైలుపట్టాల ప్రక్కగా నడుస్తున్న మంత్రులు.



# సాంకేతిక వృత్తి విద్యలు



*హైదరాబాదులో రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో సాంకేతిక, వృత్తి విద్యలను అభివృద్ధి పరచుటకు బహుముఖ కార్యక్రమం రూపొందించబడింది. ఇందుకు రూ. ౧౨౧.౯ లక్షలు ఖర్చుకాగలవని అంచనా వేయబడింది. ప్రభుత్వ మరియు ప్రయివేటు రంగాలలో అభివృద్ధి చెందవలసిన పరిశ్రమలకు, ప్రాజెక్టులకు అవసరమైన సాంకేతిక సిబ్బందిని లభింపజేయడమే ఈ కార్యక్రమం ఉద్దేశమై యున్నది. ప్రస్తుతం ఉన్నట్టి అనేక సాంకేతిక సంస్థలను అభివృద్ధిపరచుటకు వాటికి అవసరమైన అదనపు సిబ్బందిని, పరికరములను సమకూర్చుటకు ఈ కార్యక్రమంలో తలపెట్టబడింది.*

మొదటి పంచవర్ష ప్రణాళికక్రింద సాంకేతిక విద్యాశాఖకు చెందిన అనేక పాఠశాలలు పునర్వ్యవస్థీకరింపబడినవి. హైదరాబాదులో ప్రభుత్వ సంగీత, నృత్య పాఠశాల, సికింద్రాబాదులో బాలుర సాంకేతిక ఉన్నత పాఠశాల, హైద్రాబాదులో డొమెస్టిక్ సైన్సు ట్రెయినింగు కాలేజి, కేంద్ర వృత్తిపనుల సంస్థ క్రొత్తగా తెరువబడినవి. సాంకేతిక విద్యాభివృద్ధికై రూ ౨౯.౬౧ లక్షలు ఖర్చుచేయాలని అసలు పథకంలో తలపెట్టబడింది. కాని ప్రణాళికానుసారం రూపొందించబడిన పథకములకై రూ. ౧౨.౪౭ లక్షలు మాత్రమే ఖర్చుపెట్టబడినవి. ప్రణాళికలో చేర్చుకోబడని పథకములకు రాష్ట్ర ప్రభుత్వం ఆర్థికసహాయ మిచ్చింది. కేంద్రమంత్రిత్వశాఖల సహకారంతో అదనంగా అమలు పరచిన పథకములకుకూడా చాలాడబ్బు వ్యయపరచబడింది.

౧౯౫౫-౫౬ సంవత్సరములో వరంగలు, ఔరంగాబాదు, గుల్బర్గాలలో మూడు పోలీటెక్నిక్‌లు తెరువబడినవి. ఈ విద్యాసంస్థలలో అఖిలభారత జాతీయ యోగ్యతాపత్ర స్థాయిలో సివిల్ ఇంజనీరింగులో ౩ సంవత్సరాల పోస్టు–మెట్రిక్ డిప్లొమా కోర్సులు నడిపించుటకుకూడా ఏర్పాట్లు చేయబడినవి. ఈ పాలీటెక్నిక్‌లలోను, ప్రభుత్వ సాంకేతిక కళాశాలలలోను ఓవర్‌సీప్ ట్రేడు ట్రెయినింగు సెంటర్లు కూడా తెరువబడినవి. వీటిల్లో ఒక్కొక్క బట్టులో ౨౫౦ మంది విద్యార్థులను చేర్చుకొనుటకు వీలుంది. నిజామాబాదు, నాందేడు, రాయచూరులోని బాలుర సాంకేతిక ఉన్నత పాఠశాలలు, సాంకేతిక శిక్షణ కేంద్రములుగ మార్చబడినవి. నేర్పరులయిన వృత్తిపనులవారికి శిక్షణ యిచ్చుటకై రెండేండ్ల వృత్తిపనుల కోర్సులు జరుపుటకు ఏర్పాట్లు చేయబడినవి. హైద్రాబాదు, సికిందరాబాదు, వరంగలు, ఔరంగాబాదు, గుల్బర్గాలలోని బాలికల వృత్తి ఉన్నతపాఠశాలల పేర్లు బాలికల వృత్తి సంస్థలుగా మార్చబడినవి. విద్యావంతులలో నిరుద్యోగమును తొలగించుటకు ఒక పథకం తయారుచేయబడింది. ఈ పథకం ప్రకారం పి. డబ్ల్యు. డి. కి అవసరమయిన, నేర్పరులయిన పనివారలకు శిక్షణ ఏర్పాట్లు చేయబడినవి. వీరికి శిక్షణకాలము ౧౦ నెలలు ఉంటుంది. ఐదు సంస్థలలో ౧౯౫౫ డిసెంబరు ౧౬ నుంచి ఈ స్వల్పకాలిక కోర్సులు ప్రవేశపెట్టబడినవి. ఈ పథకం ప్రకారం ప్రతిసంవత్సరం ౨౫౦ మందికి వివిధ వృత్తులలో శిక్షణ ఇవ్వబడుతుంది. శిక్షణ పొందువారికి శిక్షణకాలంలో నెల ౧-కి రూ. ౩౦ ల స్టయిపెండుకూడా ఇవ్వబడుతున్నది.

ప్రభుత్వ సాంకేతిక కళాశాల భవనం విస్తృత పరచబడుతున్నది. ఈ కళాశాల అభివృద్ధికై భారత ప్రభుత్వం రూ. ౫.౨౨ లక్షలు సహాయం చేసింది. ప్రభుత్వ సాంకేతిక కళాశాల శాఖకు అదనంగా రు. ౫౦౦౦ లు కేటాయించబడినవి. ప్రయివేటు రంగంలో సాంకేతికాభివృద్ధిని ప్రోత్సహించుటకు ఈ డబ్బు వినియోగించబడుతుంది. ఇంతవరకు ౧౮ సంస్థలకు ఆర్థికసహాయము చేయబడింది. ప్రస్తుతం రాష్ట్రమంతటా ౫ బాలికల వృత్తి సంస్థలతోపాటు మొత్తం ౧౯ సాంకేతిక, వృత్తి విద్యాసంస్థలున్నవి. ఈ సంస్థలలో ౧౯౫౪-౫౫ సం.లో ౩౧౫౬ మంది ఉండగా ఇప్పుడు ౩౪౪౩ మంది వున్నారు. ఈ విధంగాచూస్తే హైద్రాబాదులో ౧౯౫౫-౫౬ సంవత్సరం



*సికింద్రాబాదు నెహ్రూ నగర్‌లో ప్రభుత్వ సాంకేతిక ఉన్నతపాఠశాల.*

సాంకేతిక విద్యాభివృద్ధి చరిత్రలో ఒక మైలురాయిగాఉంది. ఈ కాలంలో అఖిల భారత ప్రమాణములకు అనుగుణంగా వివిధ దశలలో సాంకేతిక విద్యాభివృద్ధికి సౌకర్యాలు సాధ్యమయినంతవరకు ఎక్కువచేయబడినవి.

## రెండవ పంచవర్ష ప్రణాళిక

సాంకేతిక విద్యాప్రణాళికకై ఏడు పథకములు రూపొందించబడినవి. హైదరాబాదు, వరంగల్లు, నిజామాబాదు, ఔరంగాబాదు, నాందేడు, గుల్బర్గా, రాయచూరు జిల్లాలకు ఈ పథకములు వర్తింపజేయబడుతాయి. ఈ ప్రణాళికకు రూ. ౧౨౮.౩౦ లక్షలు ఖర్చు కాగలవని అంచనా వేయబడింది. పరిశ్రమలు, పబ్లిక్ వర్క్సు, స్థానిక పరిపాలనా శాఖలకు అవసరమయిన ఇంజనీరింగు విషయాలలోను, వివిధ ప్రాజెక్టుల నిర్వహణ విషయంలోను సూపర్‌వైజరు సిబ్బందికి శిక్షణ ఇవ్వడమే దీని ఉద్దేశమై యున్నది. వరంగల్లు, ఔరంగాబాదు, గుల్బర్గాలలోని మూడు ప్రాంతీయ పోలీ టెక్నిక్‌లను అభివృద్ధి పరచుటకును, ప్రభుత్వ సాంకేతిక కళాశాలలకు అదనపు పరికరములు సమకూర్చుటకును, ఈ కళాశాలలకు అనువయిన భవనములను నిర్మించుటకును వేర్వేరులయిన పనివారలకు అనేక విభాగములలో శిక్షణ సౌకర్యాలు విస్తృత పరచుటకును తలపెట్టబడింది. భారత ప్రభుత్వ కార్మిక మంత్రిత్వశాఖ పథకముల క్రింద ప్రభుత్వ లలిత కళల కళాశాలలకు పరికరాలు సమకూర్చుటకూ, ఈ కళాశాలలకు అనువయిన భవనమును నిర్మించుటకూ, సికిందరాబాదులో ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల శాఖను తెరుచుటకూ, డొమెస్టిక్ సైన్సు ట్రెయినింగ్ కాలేజీకి అదనపు ఉద్యోగ సిబ్బందిని నియమించి, ఈ కళాశాలలకు అవసరమయిన పరికరాలను సమకూర్చుటకు తలపెట్టబడింది. డొమెస్టిక్ ట్రెయినింగు కాలేజీకొరకై ఒక హాస్టలు నిర్మించబడుతుంది. సాంకేతిక విద్య నభ్యసించు వారికి అనేక బర్సరీలు, స్కాలర్‌షిప్పులు ఇవ్వబడుతాయి. ప్రణాళిక ముగియునాటికి ఈ సంస్థలలో విద్యార్థులు, విద్యార్థి

నులసంఖ్య ౧౪౩౩ వరకు పెరుగగలదని ఆశింపబడు తున్నది.

## ౧౯౫౬-౫౭ సం. రానికి తలపెట్టబడిన కార్యక్రమాలు

రెండవ ప్రణాళిక కాలంలో మొదటి సంవత్సరంలో ఈ క్రింది పథకములు చేపట్టబడుతాయి. వీటి విషయమై ప్రభుత్వానికి సూచనలుకూడా చేయబడినవి.

౧. వరంగల్, ఔరంగాబాదు, గుల్బర్గాలలో ఉన్న మూడు ప్రాంతీయ పోలీటెక్నిక్‌ల అభివృద్ధి.

౧౯౫౫-౫౬ లో ఆరంభించబడిన మూడు ప్రాంతీయ పోలీ టెక్నిక్‌లలో ఇంజనీరింగుశాఖలు ముఖ్యంగా సివిల్ ఇంజనీరింగుశాఖ అభివృద్ధికై కృషిచేయబడుతుంది. ఈ పథకాల కనుగుణంగా మెకానికల్, ఎలెక్ట్రికల్ ఇంజనీరింగులలో డిప్లొమాకోర్సులు ప్రవేశపెట్టుటకై వలసిన ఫర్నీచరు, పరికరములు కొనుటకుగూడా తలపెట్టబడింది. ప్రతి పోలీ టెక్నిక్‌కు రూ. ౩.౦౩ లక్షల ఖర్చుతో ఆఫీసుగదులు, తరగతుల గదులు, డ్రాయింగు ఆఫీసులు, సైన్సు లేబొరేటరీ ఎలక్ట్రికల్ లేబొరేటరీ, అప్లయిడ్ మెకానిక్స్, వడ్రంగి, కమ్మరి, ఫిట్టింగ్, మెషిన్‌షాపు, ఎలక్ట్రికల్ షాపు, టైపు రైటర్లు మున్నగునవి సమకూర్చబడుతాయి. ప్రతి పోలీ టెక్నిక్‌కు అనువయిన భవనములు నిర్మించుటకు రూ. ౧.౫ లక్షలు ఖర్చుపెట్టబడుతాయి. పరికరాలకు, భవన నిర్మాణానికి అయ్యే అనావృత్తఖర్చులో మూడోవంతును భరియించుటకు కేంద్ర ప్రభుత్వం అంగీకరించింది.

## ప్రభుత్వ సాంకేతిక కళాశాల

రాష్ట్ర ప్రభుత్వం, భారతప్రభుత్వ మిచ్చు ఆర్థిక సహాయంతో ప్రభుత్వ సాంకేతిక కళాశాలకు అవసరమయిన పరికరముల కొనుగోలుకూ, మెకానికల్ లేబొరేటరీ స్థాపనకూ, రూ. ౦.౬౬ లక్షలు ఖర్చు పెడుతుంది. ఈ కళాశాలకు అనువయిన భవనంకూడా నిర్మించబడుతుంది. భవన



*ప్రభుత్వ సాంకేతిక కళాశాల, హైదరాబాదు*

నిర్మాణానికి రూ. ౧౨.౫౦ లక్షలు ఖర్చుకాగలవని అంచెనా వేయబడింది. వచ్చే సంవత్సరం దీని నిర్మాణానికై రూ. ౩ లక్షలు ఖర్చుపెట్టుటకు తలపెట్టబడింది.

## నేర్పరులైన వృత్తిపనులవారికి శిక్షణ

రెండవ ప్రణాళికలో చేర్చుకోబడిన ఐదు భారతకార్మిక మంత్రిత్వశాఖ పథకములక్రింద నేర్పరులయిన వృత్తిపనుల వారికి శిక్షణ సౌకర్యాలను పెంపొందించుటకు తలపెట్టబడింది. వివరాలు ఇవి :-

| పథకం పేరు | చేర్చబడు సీట్లు | రిమార్కులు |
|---|---|---|
| ౧. నేర్పరులైన వృత్తిపనులవారికి శిక్షణ | ౯౦ | కేంద్ర వృత్తి పనుల సంస్థలో ౫౦. హైద్రాబాదులోని బాలికల వృత్తి సంస్థలో ౪౦. |
| ౨. వృత్తిపనుల వారికి అప్రెన్‌టీస్ శిక్షణ | ౫౦ | |
| ౩. పారిశ్రామిక కార్మికులకు, నిరుద్యోగులుగా వున్న నిపుణతగల కార్మికులకు సాయంతరగతులు | ౫౦ | సనత్‌నగర్ కాలనీ |
| ౪. అధికారులకు శిక్షణ | ౨ | |
| ౫. అభిరుచి శిక్షణ కేంద్రములు | ౧౦౦ | సికిందరాబాదులోని బాలుర సాంకేతికపాఠశాలలో ౪౦. నిజామాబాదు, నాందేడు, రాయచూరులలోని ప్రభుత్వ సాంకేతిక శిక్షణ కేంద్రం ఒక్కొక్క దానిలో ౨౦ సీట్లు. |

ఈ పథకానికయ్యే ఆవృత్త, అనావృత్తఖర్చులను భారత ప్రభుత్వ కార్మిక మంత్రిత్వశాఖ, రాష్ట్ర ప్రభుత్వం సమిష్టిగా ౬౦:౪౦ నిష్పత్తిలో భరిస్తాయి. ఈ పథకానికి ఆవృత్త ఖర్చుకు రూ. ౧.౪౭ లక్షలు, అనావృత్తఖర్చుకు రూ. ౬.౩౧ లక్షలు అవుతాయి.

## నిర్వహణ

ఇదు గుమాస్తా పదవులను ఏర్పాటుచేయుటకు తలపెట్ట బడింది. ఇందుకు ఆవృత్త ఖర్చుకై రూ. ౦.౦౮ లక్షలు కేటాయించబడుతాయి. ఈ అదనపు సిబ్బందికి ఫర్నీచరు ఇతర పరికరములకై రూ. ౩౦౦౦ లు ఖర్చు కాగలవని అంచనా వేయబడినది. సాంకేతిక పరీక్షల నిర్వహణకై ప్రస్తుతం బడ్జెటులో రూ. ౩౬,౮౫౧ లు కేటాయించబడినవి. ఇది చాలకపోవడం వల్ల అదనంగా రూ. ౧౫,౦౦౦ లు కేటాయించబడుతాయి. ప్రయివేటుగా అనేక సాంకేతిక సంస్థలు నడుస్తున్నవి. అవి ఆర్థిక సహాయాన్ని అభ్యర్థిస్తున్నవి. వీటిని ప్రోత్సహించవలసి వున్నది. కనుక వచ్చే సంవత్సరంలో వీటికి ఇచ్చే గ్రాంటు సుమారు ౨౦,౦౦౦ ల వరకు ఎక్కువ చేయ తలపెట్టబడింది. సాంకేతిక సంస్థలు, బహూశార్థ సాధక ఉన్నత పాఠశాలలు సాంకేతిక శాఖలను తనిఖీచేయుటకై రూ. ౩౦౦-౬౦౦ల గ్రేడులో ముగ్గురు గజిటెడ్ ఇన్‌స్పెక్టర్లను నియమించుటకు తలపెట్టబడింది.

## ఇతర పథకములు

అప్లైడ్ ఆర్ట్ అండ్ డిజైను అధ్వర్యాన ప్రభుత్వ లలిత కళల పాఠశాలలో రూ. ౬౦౦౦ ల అవృత్తఖర్చుతో నగిషీ పనిని ప్రవేశపెట్టుటకు తలపెట్టబడింది. రెండో ప్రణాళిక మొదటి సంవత్సరంలో రూ. ౪౧,౦౦౦ ల ఖర్చుతో పరికరములు, ఫర్నీచరు, మ్యూజియం వస్తువులు, పుస్తకాలు మున్నగువాటిని కొనుటకు తలపెట్టబడింది. ఈ కళాశాలకు వచ్చే సంవత్సరం లక్షరూపాయల ఖర్చుతో ఒక భవనం నిర్మించబడుతుంది. సికింద్రాబాదులో ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల శాఖను ఒకదానిని తెరచుటకు తలపెట్టబడింది. ఈ శాఖలో కర్నాటక గాత్ర సంగీత, జంత్ర సంగీత, భరత నాట్యములలో మూడేండ్ల కోర్సులు ఆరంభించబడుతాయి. ఈ పథకానికై ఆవృత్త ఖర్చు రూ. ౫౦౦౦ లు, అనావృత్త ఖర్చు రూ. ౬౦౦౦ లు అవుతాయి. ఈ పాఠశాలలో ౬౦ మంది చేర్చుకోబడుతారు

డొమెస్టిక్ సైన్సు ట్రెయినింగు కాలేజీకి మంజూరయిన సిబ్బంది చాలడంలేదు. కనుక రూ. ౧౫౪-౨౬౫ గ్రేడులో అదనంగా ఒక ఉపాధ్యాయ పదవిని ఏర్పాటుచేయుటకు తల పెట్టబడింది. ఈ కళాశాలకు పరికరాలకు, కుటీర పరిశ్రమలను నేర్పుటకు, వంట సామగ్రికి, గ్రంథాలయ పుస్తకాలకూ రూ. ౮,౦౦౦లు ఖర్చుఅవుతాయి. లక్షరూపాయలు ఖర్చుతో కళాశాల హాస్టలు నిర్మించుటకు తలపెట్టబడింది. వలసిన పరికరాలను సమకూర్చుటకు రూ. ౧౬,౦౦౦ లు ఖర్చు కాగలవని అంచెనా వేయబడింది. కళాశాల సిబ్బందికి, హాస్టలు నడుపుటకు అవృత్తఖర్చు రూ. ౧౪౦౦౦ లు అవుతాయని అంచెనా వేయబడింది.

సాంకేతిక కోర్సులను చదువుటకు విద్యార్థులు, విద్యార్థినులను ప్రోత్సహించుటకు వారికి భారీయెత్తున బర్సరీలు, ఉపకార వేతనములు ఇచ్చుటకు తలపెట్టబడింది. ఇందుకు అయ్యే ఖర్చును భరించుటకు రెండో ప్రణాళిక మొదటి సంవ




సెంట్రల్ క్రాఫ్ట్స్ ఇన్‌స్టిట్యూట్, హైదరాబాదు.

ర్సరంలో ఆవృత్తఖర్చు క్రింద రూ. ౨౫,౦౦౦లు కేటాయించబడినవి. పైన తలపెట్టబడిన పథకానికి ప్రణాళిక మొదటి సంవత్సరంలో ఆవృత్తఖర్చు క్రింద రూ. ౩.౧౦ లక్షలు. అనావృత్తఖర్చుక్రింద రూ.౨౬.౩౭లక్షలు ఖర్చుఅవుతాయి. భవననిర్మాణానికయ్యే రూ.౧౩.౭౮లక్షలఖర్చులో రూ.౮.౭౮ లక్షలు మూలధనం లెక్కలో నుంచి వినియోగించుటకు తలపెట్టబడింది.

ప్రణాళికలో చేర్చుకోబడనట్టి కొన్ని ఇతర ప్రతిపాదనలు ప్రభుత్వామోదానికై పంపబడినవి. వాటికి మొత్తం మీద ఆవృత్త ఖర్చు క్రింద రూ. ౮,౦౦౦ లు ఖర్చుఅవుతాయి. సాధారణ అభివృద్ధి కార్యకలాపాల నిర్వహణకై ఈ ప్రతిపాదనలు చేయబడినవి.

* * *

---

## భారతదేశంలో దశాంశపద్ధతి నాణెములు [౨౬ వ పుట తరువాయి]

చిన్న మణుగుకు ౨౮౦ తులాలు అయితే అన్నిటి కంటె పెద్దమణుగుకు ౮,౩౨౦ తులాలు. ప్రమాణ బద్ధమైన మణుగుకు ౩,౨౦౦ తులాలు. ఈవిధంగా భిన్నత్వంవుండి, సార్వజనీనంగా ప్రమాణబద్ధమైన మణుగు అంటూ ఒకటి లేకపోవటంవల్ల ఎన్నో అవకతవకలు జరుగుతూవుంటాయి. కనుక ప్రమాణమంటూ ఒకటి ఉండాలంటే అది వెంటనే శాస్త్రీయ పద్ధతిప్రకారం జరగాలి. శాస్త్రీయమైనది మెట్రిక్ పద్ధతి.

( ఆలిండియా రేడియో సౌజన్యంతో )

# మరాట్వాడాలో ఉన్నత విద్యావ్యాప్తికై కృషి



**రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచాలంటే సుమారు ౪,౩౦౦ మంది వ్యవసాయ పట్టభద్రులు అవసర మవుతారు. కనుక ఇప్పటినుంచే వ్యవసాయ కళాశాలలను స్థాపించుటకూ, ప్రస్తుతంఉండే కళాశాలల్లో సౌకర్యాలను విస్తృతపరచుటకూ కృషిచేయాలి అని హైదరాబాదు విద్యాశాఖా మంత్రి గత మాసంలో పర్భనీలో ప్రభుత్వ వ్యవసాయ కళాశాలను ప్రారంభిస్తూ అన్నారు.**

*పర్భనీలో వ్యవసాయ కళాశాలను ఆరంభించడంతో మరాట్వాడా జిల్లాలో మొత్తం ౧౦ కళాశాలలు ఉంటాయి. వీటిలో ఈ విద్యాసంవత్సరారంభంలో ఔరంగాబాదు, నాందేడు, మోమినాబాదులలో కొత్తగా తెరువబడిన మెడికల్, లా, ఆయుర్వేద, సైన్సు కాలేజీలుకూడా చేరివున్నాయి.*

శ్రీ ఎక్బోటే ఇంకా ఇలా అన్నారు: ఇటీవలి వరకు జిల్లాల్లో విద్యావ్యాప్తికై శ్రద్ధవహించబడ లేదు. ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించబడిన చాలాకాలం తరువాత గుల్బర్గా, ఔరంగాబాదు, వరంగల్‌లలో ఇంటర్‌మీడియెట్ కాలేజీలు తెరువ బడినాయి. జిల్లాల్లో వృత్తివిద్యా కళాశాలలుగానీ, ఉన్నత పాఠశాలలుగానీ లేకుండినవి. ప్రస్తుత ప్రభుత్వము ఈ లోటును తీర్చాలి. గత ఆరేండ్లనుంచి విద్యావ్యాప్తికై సౌకర్యాలు కల్పించాలని రాష్ట్ర నలుమూలలనుంచి ప్రజలు ఒత్తిడిచేస్తున్నారు. అందుకు అనుగుణంగానే ప్రభుత్వం ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యావ్యాప్తికై తగు కృషిచేసింది.

## ప్రణాళికక్రింద విద్యాప్రగతి

రాష్ట్రంలో ప్రాథమిక పాఠశాలల సంఖ్య ౧౩ వేలు దాటిపోయింది. రాష్ట్ర జనాభాలో ౭౫ శాతం మందికి ఈ పాఠశాలలు విద్యా సౌకర్యాలు కల్పిస్తు న్నాయి. మాధ్యమిక పాఠశాలల సంఖ్య మూడు రెట్లకు పెరిగింది. రెండవ ప్రణాళికలో రాష్ట్రంలో అదనంగా ౨౫౦౦ ప్రాథమిక పాఠశాలలను, ౧౦౦౦ మాధ్యమిక పాఠశాలలను తెరచుటకు తలపెట్టబడింది. ఉన్నత విద్యారంగంలో కూడా అభివృద్ధి సాధించుటకు పరిశీలనలు చేయబడు తున్నాయి. అనేక బహూకార్థ సాధక పాఠశాలలు కూడా తెరువబడినాయి. ఇంకనూ తెరువబడు తాయి కూడా. వీటికీ, ప్రస్తుతంవుండే స్కూళ్ళ వ్యవస్థకూ తేడావుంది. ప్రాథమిక విద్యనుంచి హైయ్యర్ సెకండరీవరకు చదువుకునే కాలం ౧౧ ఏండ్లు ఉంటుంది. బహూకార్థసాధక పాఠశాలల్లో వ్యవసాయం, టెక్నాలజీ, వాణిజ్యం, విజ్ఞానశాస్త్రం, గృహవిజ్ఞాన శాస్త్రం, లలితకళలు మున్నగునవి బోధించబడుతాయి. పదకొండో సంవత్సరం పూర్తి యినతరువాత, కళాశాలలకు పోనిష్టం లేని విద్యార్థి గానీ లేక విద్యార్థినిగానీ శిక్షణకొరకై ఏదైనా ఒక సాంకేతిక సంస్థలో చేరుటకు వీలుంటుంది. లేదా వారు వృత్తిపనులను అవలంబించుటకు ఆస్కార ముంటుంది.

బహూకార్థసాధక పాఠశాలల్లో వ్యవసాయం, టెక్నాలజీ, వాణిజ్యంవంటి కోర్సులున్నపుడు ప్రత్యేక విద్యాసంస్థలైన వ్యవసాయ ఉన్నత పాఠశాలల్లోగానీ

లేదా సాంకేతిక ఉన్నత పాఠశాలల్లోగానీ సాధారణ విద్యాకోర్సులను ప్రవేశపెట్టి తద్వారా వాటినికూడా బహుళార్థసాధక పాఠశాలలుగా మార్చవలసివస్తుంది. కనుక పర్భనీలోని వ్యవసాయ ఉన్నత పాఠశాలను బహుళార్థ సాధక పాఠశాలగా మార్చవలసివచ్చింది. మరాట్వాడాలో వ్యవసాయంలో ఉన్నత విద్యను బోధించడం అవసరమైంది. పర్భనీలో ఒక కళాశాలను తెరుపడంవల్ల ఈ అవసరం తీరింది.

విద్యాసంస్థలలో సాంకేతికవిద్యను బోధించుటకు ప్రభుత్వం సంకల్పిస్తున్నది. అందుకని ఔరంగాబాదులో ప్రభుత్వం పాలిటెక్నిక్ కోర్సును ప్రవేశపెట్టింది. ఈ విషయంలో ప్రయివేటుసంస్థలు కూడా కృషిచేస్తున్నవి. లాతూరులో ప్రయివేటుగా ఒక సాంకేతికసంస్థ నెలకొల్పబడడం ఇందుకు నిదర్శనము. మరాట్వాడాలో సాధారణ విద్యను బోధించుటకై అనేక కళాశాలలు నెలకొల్పబడినవి. నాందేడులో పీపుల్సు కాలేజి, ఔరంగాబాదులో మిలింద మహా విద్యాలయం, వైద్యకళాశాల, లా కాలేజి, విద్యాకళాశాల, మోమినాబాదులో క్రొత్త కళాశాల, నాందేడులో ఆయుర్వేదకళాశాల తెరవబడడం ప్రగతిని సూచిస్తున్నవి. ఔరంగాబాదులో ఇంటర్మీడియెట్ కళాశాల ఆర్ట్సు, సైన్సు డిగ్రీ కాలేజీగా మార్చబడింది. ఈవిధంగా మరాట్వాడా ప్రాంతంలో సాధారణ, ఉన్నత, వృత్తి విద్యలు అన్నివిధాలా అభివృద్ధి చెందుతున్నవి.

విద్యాశాఖామంత్రి ఇంకా ఇలా అన్నారు. మరాట్వాడాలో వ్యవసాయ భూమి సారవంతమైనది. ఈ ప్రాంతంలో ఆహారపంటలు, నగదుపంటల పరిస్థితి బాగున్నది. ఇప్పుడు మరాట్వాడా ప్రజలు తీవ్రోత్పత్తికి పూనుకోవాలి. మేలురకం సేద్యపద్ధతులు అవలంబించాలి. వ్యవసాయాభివృద్ధికై, సక్రమంగా భూసార పరిశోధన జరగడం అవసరం మరాట్వాడా ప్రజల ముఖ్య వ్యవసాయ ఉత్పత్తులైన ప్రత్తి, గోధుమ, జొన్నలవిషయమై ప్రయోగములు చేయుటకు పరిశోధన కేంద్రము లున్నాయి. పర్భనీలో సాంకేతిక కళాశాల నెలకొల్పబడడంవల్ల అది వ్యవసాయాభివృద్ధికి చాలా తోడ్పడుతుంది. అంతేకాకుండా సాంకేతిక శిక్షణ పొందు వ్యక్తుల కొరత తీరుతుంది. ఈ కళాశాలలకు అనుబంధంగా ఒక పశువైద్య కళాశాల కూడా నెలకొల్పబడాలని మంత్రిగారు తమ ఆశయం వెల్లడించారు.



# హైదరాబాదు డైరీ



## ౧౯౫౬ ఆగస్టు

౧. హైదరాబాదు శాసనసభ, ౧౯౫౬ వ సంవత్సరపు హైద్రాబాదు నీటిపారుదల సవరణబిల్లును ఆమోదించింది.

౨. హైద్రాబాదు రాష్ట్రానికి వర్తింపుజేసే విషయంలో ౧౯౩౯ వ సంవత్సరపు మోటారుబండ్ల చట్టాన్ని సవరించే ఒక బిల్లును రాష్ట్ర శాసనసభ ఆమోదించింది. ఈ బిల్లు ననుసరించి రాష్ట్రంలోని ఏ ప్రాంతాలలోనయినా తన రోడ్డు రవాణా సర్వీసులను నడుపుకోవడానికి ప్రభుత్వానికి అధికారం ఉండగలదు. ఒకవేళ ఏదయినా మార్గంలో ప్రైవేటు బస్సులు నడుస్తున్నట్లయితే ప్రభుత్వం కొంత పరిహారం చెల్లించి ఆ మార్గాన్ని స్వాధీనపరచుకోవడానికికూడా ఈ బిల్లు అధికారా న్నిస్తున్నది.

౩. ఆఫ్ఘన్ స్వాతంత్ర్య దినోత్సవాల సందర్భంగా కాబూల్‌లో జరిగే వేడుకలలో పాల్గొనడానికై ఫుట్‌బాల్ జట్టును పంపవలసిందిగా ఉస్మానియా యూనివర్సిటీకి ఆహ్వానము వచ్చింది.

౪. ఔరంగాబాదులో జరిగిన స్థానిక సంస్థల మహాసభను శ్రీ గోపాలరావు ఎక్బోటే ప్రారంభించారు.

౫. అఖిలభారత తపాలా ఉద్యోగుల మహాసభయొక్క హైద్రాబాదు జి. పి. ఓ. కు చెందిన రెండవ, నాలుగవ తరగతుల ఉద్యోగుల శాఖకు హైదరాబాదులో ప్రారంభోత్సవం జరపబడింది.

౬. నాందేడు సిక్కు గురుద్వారాను సక్రమంగా నిర్వహించడానికై శాసనసభ ఒకబిల్లును ఆమోదించింది. ఈ బిల్లు ననుసరించి గురుద్వారా వ్యవహారాలను ౧౭ మంది సభ్యులుగల ఒకబోర్డు చూస్తూఉంటుంది.

౭. నిర్ణీత ప్రదేశాలలో ప్రజోపయోగం కొరకు ఖాళీ ఇండ్లను కేటాయించే విషయంలో ప్రభుత్వానికి ఇతోధికారాలను సంక్రమింపజేసే ఒకబిల్లును రాష్ట్ర శాసనసభ ఆమోదించింది.

౮. హైదరాబాదు జంతు ప్రదర్శనశాలనుంచి రెండు చిరుత పులులు తప్పించుకొని బయటపడి పబ్లిక్ గార్డెన్సు ప్రాంతంలో కొంత కలవరపాటును తెచ్చిపెట్టాయి. అయితే ఆ తరువాత రెండుగంటలకే వాటిని నిర్బంధించడం జరిగింది.

౯. వ్యవసాయోత్పత్తిని నూటికి ౪౦ వంతులు అధికంజేసే ఉద్దేశంతో నీటివనరుల సౌకర్యాలను హెచ్చింపజేసే కార్యక్రమానికి రెండవ పంచవర్ష ప్రణాళికలో విశేషప్రాధాన్యమివ్వబడగలదని రాష్ట్ర ముఖ్యమంత్రి శాసనసభలో వెల్లడించారు.

౧౦. ఆంధ్ర ప్రాంతంలో తెలంగాణా లీనం చేయబడిన తరువాత తెలంగాణాకై కల్పింపబడిన రక్షణలు ఏవిధంగా అమలుపరచబడేదీ విశదీకరిస్తూ కేంద్ర ప్రభుత్వ దేశీయ వ్యవహారాల మంత్రి శ్రీ బి. ఎన్. దతార్ లోక్‌సభలో ఒక సమగ్ర ప్రకటన చేశారు.

౧౧. అఖిల హైద్రాబాదు నూనె వర్తకుల మహాసభను ప్రారంభిస్తూ ఆహారనూనెల ఉత్పత్తిని గానుగలకు (గ్రామీణ నూనె పరిశ్రమకు) ప్రత్యేకించే విషయాన్ని భారత ప్రభుత్వం యోచిస్తున్నదని శ్రీ వినాయకరావు విద్యాలంకార్ తెలిపారు.

౧౨. రోజుకు ౧,౦౦౦ టన్నులచొప్పున బొగ్గు ఉత్పత్తి చేసే ఒక కొత్తగనికి కొత్తగూడెంలో రాష్ట్ర పబ్లిక్ వర్క్సు మంత్రి డా. జి. ఎస్. మేల్కోటే ప్రారంభోత్సవం చేశారు.

౧౩. ౧౯౫౬ నవంబరు ౧ వ తేదీన ఏర్పడనున్న ఆంధ్రప్రదేశ్‌కు అదనంగా తరలింపబడే సిబ్బందికి, కార్యాలయాలకు వసతి సౌకర్యాలు కల్పించడానికి రూ. ౧౦౩ లక్షలు మంజూరుచేయడానికై రాష్ట్ర శాసనసభ సప్లిమెంటరీ డిమాండ్లను ఆమోదించింది.

౧౪. నూత్న రాష్ట్రంలో తెలంగాణా ప్రజలకు కల్పించబడనున్న రక్షణల విషయంలో ఆంధ్ర, తెలంగాణానాయకుల మధ్య జరిగిన ఒప్పందాలను రాష్ట్ర ముఖ్యమంత్రి శాసనసభలో చదివి వినిపించారు. శాసన సభ తిరిగి సెప్టెంబరు నెలలో సమావేశమైనప్పుడు ఈ ఒప్పందాల విషయమై చర్చ జరుగగలదని ఆయన అన్నారు.

౧౫. రాష్ట్రమంతటా ప్రభాత భేరీలతోనూ, పతాక వందనాలతోనూ, సమావేశాలతోనూ, విందులతోనూ స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు జరిగాయి.

౧౬. రాష్ట్రంలో అతివృష్టి వల్ల దెబ్బతిన్న ప్రాంతాలలో సహాయక చర్యలు గైకొనడానికి ఇచ్చట జరిగిన మంత్రుల, అధికార్ల సమావేశంలో నిర్ణయించబడింది.

౧౭. రాష్ట్ర విద్యా మంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే గుల్బర్గాలో శ్రీ శరణ బసవేశ్వర సైన్సు కళాశాలను ప్రారంభిస్తూ ఆ సంస్థకు రూ.౩౮,౦౦౦ల విరాళాన్ని ప్రకటించారు.

౧౮. ఇచ్చట జరిగిన ఆంధ్ర, హైద్రాబాదు మంత్రుల సమావేశంలో ప్రస్తుతం మద్రాసు, గుంటూరు, కర్నూలులో గల ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయా లన్నింటినీ ౧౯౫౬ నవంబరు ౧ వ తేదీ నాటికి హైదరాబాదు నగరానికి తరలించవలెనని నిర్ణయం గైకొనబడింది.

౧౯. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వంలో కీలక పదవులలో నిర్ణయింపబడే అధికార్ల విషయమై ఇచ్చట జరిగిన ఆంధ్ర, హైద్రాబాదు మంత్రుల సమావేశంలో నిర్ణయాలు తీసుకోబడినవి.

౨౦. ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాలన్నింటినీ కర్నూలు నుంచి హైద్రాబాదు తరలించే పని నవంబరు ౧ వ తేదీనాటికి గాని లేదా డిసెంబరు నెలారంభం వరకు గాని ముగించబడగలదని ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి కర్నూలులో శాసనసభలో మాట్లాడుతూ అన్నారు.

౨౧. ఢిల్లీ శాసనసభ అధ్యక్షురాలు డా. సుశీలా నయ్యర్ గాంధీభవన్‌లో జరిగిన మహిళా కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ దేశంలోని పార్టీ రాజకీయాలతో మహిళలు ప్రమేయం పెట్టుకోరాదని విజ్ఞప్తిచేశారు.

౨౨. అవతరించనున్న నూతన బొంబాయి ద్విభాషా రాష్ట్రంలో మరాట్వాడా కొరకు బొంబాయి హైకోర్టు యొక్క ప్రత్యేక బెంచీని ఏర్పాటుచేయాలని కోరుతూ హైద్రాబాదు హైకోర్టుకు చెందిన దాదాపు ౨౦మంది న్యాయవాదులు ఒక సమిష్టి ప్రకటనచేశారు.

౨౩. ఆంధ్ర ప్రదేశ్‌లో కొన్ని పదవులకై ఆంధ్ర, హైద్రాబాదు మంత్రివర్గస్థాయి సమావేశంలో తాత్కాలికంగా చేయబడిన అభ్యర్థుల నిర్ణయాలు కేవలం సీనియారిటీ, సమర్థత, అనుభవం, పరిపాలనా దక్షత, విభాజిత రాష్ట్రావసరాలను పురస్కరించుకొని చేయబడినవని ఆంధ్ర ముఖ్యమంత్రి కర్నూలులో శాసనసభలో ప్రశ్నలకుసమాధానమిస్తూ తెలియజేశారు.

౨౪. ఆగస్టు ౨౧ వ తేదీన నిజామాబాదుజిల్లా కామారెడ్డి సబ్‌జైలులో ఒక కాపలాదారు ఇద్దరు ఖైదీలూ, నేర విచారణలోవున్న మరొక అపరాధి పరారు కావడానికి వీలు కల్పించి తానూ ఒక తుపాకీతోసహా ఎచ్చటికో పారిపోయినట్టు వర్తమానం వచ్చింది.

౨౫. ౧౮౫౭ వ సంవత్సరంలో జరిగిన భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారి స్మారక చిహ్నంగా ౨౫ అడుగుల ఎత్తుగల ఒక స్థూపాన్ని నిర్మించడానికి ఔరంగాబాదు పురపాలకసంఘం నిర్ణయించింది.

౨౬. హైద్రాబాదు ప్రభుత్వంచే నియమింపబడే ఎకామొడేషన్ కంట్రోలర్‌తో కలసి పనిచేయడానికై ఆంధ్ర ప్రభుత్వ ప్లానింగు, అభివృద్ధిశాఖల కార్యదర్శి శ్రీ సి. నరసింహం హైద్రాబాదుకు డిప్యూటు చేయబడినారు.

౨౭. చెర్లగూడెం పటేల్ శ్రీ జి. సీతారామరెడ్డిని, అతని భార్యను, ఇద్దరు పిల్లలను ఎవరో విరోధులు చిత్రవధచేసినట్లు సమాచారం అందింది. చెర్లగూడెం షష్టూబాదుకు మూడుమైళ్ళ దూరంలో కలదు.

౨౮. గత ౨౫ సంవత్సరాలనుంచీ ఎర్రగడ్డ పిచ్చి ఆసుపత్రిలో చికిత్సపొందుతున్న శ్రీ మొహమ్మద్ హుసేన్ అనే అతను ఆసుపత్రినుంచి సైకిలుఎక్కి పరారు అయ్యాడు. అయితే మార్గమధ్యంలోనే అతణ్ణి పట్టుకొని తిరిగి ఆసుపత్రిలో చేర్చడమయినది.

౨౯. అధికార్లు, అనధికార్లమధ్య సన్నిహితత్వాన్ని పెంపొందించడానికి, అభివృద్ధి కార్యకలాపాలను విస్తృతంగా కొనసాగించే నిమిత్తమూ రాష్ట్రంలో యోగ్యమైన ప్రాంతాలను ఎన్నుకోవడానికి రాష్ట్రస్థాయిపై ఒక కార్యాచరణసంఘం ఏర్పాటుచేయబడింది.

౩౦. చెర్లగూడెం గ్రామంలో శ్రీ జి. సీతారామిరెడ్డి, అతని భార్య, ఇద్దరుపిల్లలు హత్యచేయబడిన కేసువిషయములో ఎనిమిదిమంది వ్యక్తులు అరెస్టు చేయబడినారు.

౩౧. వరదల సహాయ చర్యలకుగాను రాష్ట్ర ప్రభుత్వం రూ. ౬౦,౦౦౦ ల మొత్తాన్ని మంజూరుచేసింది.



# వార్తలు - విశేషాలు

## సారాయి నిలువ

౧౩౧౬ ఎ ఫసలీ హైద్రాబాదు ఆబ్కారీచట్టం యొక్క ౧౧ వ సెక్షనులో రెండు మినహాయింపులు చేయబడినవి. ఇవి ౧౯౫౬ అక్టోబరు ౧ వ తేదీ నుంచి అమలులోకి రాగలవు. ఈ మినహాయింపుల ననుసరించి మత్తుపానీయాల వినిమయదారుడెవరైనా చట్టబద్ధంగా లైసెన్సు పొందినట్టి షాపులో ఉండగా తనవద్ద కల్లునుగాని, దేశీ సారాయినిగాని లేదా నాటు సారాయినిగాని ఒక తడవకు ఉపయోగించ గలిగినంత మేరకు ఉంచుకోవచ్చును. ఒకవేళ అతడు ప్రైవేటు వాడకంకొరకు దేశీ సారాయినిగాని, విదేశ సారాయి పద్ధతిన తయారుచేయబడే దేశీ సారాయినిగాని లేదా విదేశీ సారాయినిగాని తనవద్ద వుంచదలిస్తే ౪ క్వార్ట్‌సీసాల మేరకుమాత్రం వుంచుకోవడానికి అనుమతించబడగలదు.

## అనువాదక సంస్థ

కేంద్ర అనువాదక సంస్థ ఇకమీదట న్యాయశాఖ అంతర్భాగంగా వ్యవహరించబడ గలదు. కనుక ఈ సంస్థలో నియుక్తులైనయున్న ఉద్యోగులందరికీ ౧౯౫౬ జూన్ ౧ వ తేదీనుంచి సచివాలయ భత్యాలు చెల్లించబడగలవు. దీని ఫలితంగా ఈ సంస్థలో ప్రధాన అనువాదకులుగా ఉంటున్నవారు ఇకనుంచి న్యాయశాఖ సహాయ కార్యదర్శిగా వ్యవహరింపబడగలరు.

## రైతులకు రియాయతీ

ఖుష్కీభూములను తరీభూములుగా మార్చడానికై రైతులను ప్రోత్సహించే ఉద్దేశంతో హైద్రాబాదు ప్రభుత్వం కరీంనగర్ జిల్లాలోగల బండలవాగు ప్రాజెక్టుక్రింద తరీశిస్తులో ఈ క్రిందివిధంగా రియాయతీ ఇవ్వడానికి సమ్మతించింది :

మొదటి సంవత్సరం: ఖుష్కీశిస్తు; రెండవ సంవత్సరం: తరీ శిస్తులో ౧/౩ వంతు. మూడవ సంవత్సరం తరీశిస్తులో ౨/౩ వంతు, నాల్గవ సంవత్సరము: పూర్తి తరీశిస్తు; అయితే రైతులు మొదటి సంవత్సరాంతాన తమ భూమిలో మూడోవంతును, రెండవ సంవత్సరాంతాన సగం భూమిని, మూడవ సంవత్సరాంతాన మూడింట రెండువంతుల భూమిని, నాలుగవ సంవత్సరాంతాన పూర్తి భూమిని అభివృద్ధి పరచవలసివుంటుంది. ఈ విధంగా చేసే పక్షంలోనే పై రియాయతీ ఇవ్వబడగలదు.

## ఫీల్డు పనులకు రుసుములు

భూములను విభాగాలుచేసే పనికైనా లేక పొలాల హద్దులను ఏర్పాటుచేసే పనికైనా ల్యాండు రికార్డు ఉద్యోగులు చేసే అన్ని విధములైన ఫీల్డు పనులకు ఈ క్రింది రేట్ల ప్రకారం రుసుములను వసూలుచేయవలెనని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ రుసుములను ౧౯౫౬ లో సెటిల్మెంటు శాఖను పునర్వ్యవస్థీకరించడానికై నియమింపబడిన కమిటీవారు సిఫార్సు చేసినారు. (౧) ఎం.సి. ఇన్‌స్పెక్టరు—రోజుకు నాలుగు రూపాయలు, (౨) జి. డి. ఇన్‌స్పెక్టరు—రోజుకు ౬ రూపాయలు (౩) ల్యాండ్ రికార్డు ఆఫీసరు—రోజుకు ౧౦ రూపాయలు (౪) అసిస్టెంటు సెటిల్మెంటు కమీషనర్—రోజుకు ౨౦ రూపాయలు.

జిల్లాకేంద్రాలకు ౫ మైళ్ళ లోపలవున్న గ్రామాలకైతే అధికార్ల రాకపోకలకయ్యే ఖర్చులకు రుసుము

వసూలుచేయబడదు. జిల్లా కేంద్రాలకు ౫ మైళ్లకంటే ఎక్కువదూరం వుంటే ఆ దూరం ఎంతవున్నాసరే అధికార్లకు రోజుకు మామూలుగా ఇచ్చే రుసుముతో పాటు రాకపోకలకై రెండురోజులరుసుమును వసూలు చేయడ మవుతుంది.

## వన్యమృగముల సంరక్షణ సప్తాహం

౧౯౫౬ అక్టోబరు నెల మొదటి వారంలో అన్ని రాష్ట్రాలలోనూ 'వన్యమృగములసంరక్షణసప్తాహం' జరుపబడగలదు. ఇందుకై వన్యమృగముల సంరక్షణ సప్తాహోత్సవాలకు చెందిన కేంద్ర కమిటీ గ్రామాల లోనూ, జిల్లా కేంద్ర స్థానాలలోనూ, రాజధాని నగ రంలోను స్థానిక కమిటీలను ఏర్పాటు చేసింది. ఆగష్టు నెల ౩ వ తేదీన కేంద్రకమిటీ సమావేశాన్ని ప్రారంభిస్తూ రాష్ట్ర అటవీశాఖ మంత్రి, ఈ కమిటీ అధ్యక్షుడు అయిన శ్రీ కె. వి. రంగారెడ్డిగారు వన్య మృగముల సంరక్షణ ద్వారా దినదినమూ క్షీణించి పోతున్న మన జాతీయ వన్యమృగ సంపదను పున రుద్ధరించవలసిన బాధ్యత మనపయిన ఎంతయినా గలదనీ, అట్లా చేయడానికి సమయమేమీ మించి పోలేదనీ అన్నారు. మనుష్యుడు వన్యమృగములను చంపడం తగ్గించి, వాటిని సంరక్షించ దలచినట్లయితే అవి వృద్ధిచెందగలవని అన్నారు. వన్యమృగములను ఒక విచక్షణతో వృద్ధిచెందనిచ్చినట్లయితే ప్రకృతి పరిపోషణ హెచ్చుతగ్గులు లేకుండా ఉంటుంది. కెమే రాతో షికారుకుపోవడం చాలా అహింసాత్మకమైన వేటఅని చెప్పవచ్చు. ఆ కెమేరాతో వన్యమృగముల ఛాయాచిత్రాలను తీసినట్లయితే వాటివల్ల సజీవమైన మృగములచిత్రాలు వారివద్ద వుండడమేగాక వాటివల్ల వారికి కొన్ని బహుమతులు కూడా లభించవచ్చును.

## కార్మికుల వినిమయ సూచీసంఖ్యలో పెరుగుదల

రాష్ట్రంలోని ఆరు కేంద్రాలలోనూగల కార్మికుల వినిమయ సూచీ సంఖ్యలు ౧౯౫౬ జూలై నెలలో కొద్దిగా పెరుగుదలను సూచించాయి. నిజామాబాదు, నాందేడు, గుల్బర్గా కేంద్రాల సూచీసంఖ్యలు ౩ పాయింట్ల పెరుగుదలను సూచించగా హైదరాబాదు నగరం, ఔరంగాబాదు, వరంగల్లు కేంద్రాల సూచీ సంఖ్యలు వరుసవారీగా ౨, ౨, ౧ పాయింట్ల పెరుగు దలను సూచించాయి. హైద్రాబాదు నగర కేంద్ర సూచీ సంఖ్యలు ౧౮౧ పాయింట్లను, ఔరంగాబాదు కేంద్ర సూచీసంఖ్యలు ౧౮౩ పాయింట్లను, నిజామా బాదు కేంద్ర సూచీసంఖ్యలు ౧౯౬ పాయింట్లను, నాందేడు కేంద్ర సూచీసంఖ్యలు ౨౨౪ పాయింట్లను, గుల్బర్గా కేంద్ర సూచీసంఖ్యలు ౧౭౧ పాయింట్లను సూచించాయి.

## ఉద్యోగ పరిస్థితి

౧౯౫౬ జూలై నెలలో రాష్ట్ర ఉద్యోగ పరిస్థితిని గత మాసంతోపోల్చి చూచినట్లయితే కొంతమాంద్యం గోచరిస్తుంది. ఎక్స్ఛేంజీలలో ఉద్యోగాలకై పేర్లను నమోదు చేయించుకున్న అభ్యర్థులసంఖ్య ౪ వేలకు పయిగా పెరగ్గా ఉద్యోగాలు లభించిన వారిసంఖ్య క్రమేణా తగ్గిపోతున్నది. జూన్ నెలలో ఎక్స్ఛేంజీ లలో ౩,౯౩౬ మంది అభ్యర్థులు ఉద్యోగాలకై పేర్లను నమోదు చేయించుకోవడంజరగ్గా జూలై నెలలో ౪౧౯౧ మంది తమపేర్లను నమోదు చేయించుకోవడం. ౬౧౭ మందికి ఉద్యోగాలు దొరకడం జరిగింది.





*1956* ఆగస్టు *31* వ తేదీన మహబూబ్‌నగర్‌లో కొత్తగా నెలకొల్పబడిన సాంకేతిక కళాశాలను
రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.

[దిగువ] రాష్ట్ర ప్రభుత్వం వరంగలులో ప్రారంభింపబడిన ఆయుర్వేద కళాశాలకు విశ్వేశ్వర సంస్కృతం
ఆయుర్వేద కళాశాల ప్రస్తుతం ఉన్న భవనముయొక్క ముందరి భాగపు దృశ్యం.



